## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..








"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 904 202 0123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవనసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

నెహ్రూ బాల పుస్తకాలయం

# అమర సాహిత్యం

రచన

మనోజ్ దాస్

అనువాదం

చెఱుకుమిల్లి భాస్కర రావు

చిత్ర రచన

సుకుమార్ చటర్జీ







నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# అమర సాహిత్యం

రెండు వేల సంవత్సరాలకు పూర్వం చైనా దేశంలో సీవాంగ్‌టీ అని ఒక చక్రవర్తి ఉండేవాడు. ఒక వింత కారణం వల్ల ఆయనకు తన ప్రజలంటే అమిత కోపం వచ్చింది. వాళ్లు విపరీతంగా పుస్తకాలు చదువుతూంటారు. చదువు రాకపోతే ఎవరిచేతనైనా చదివించుకుని వింటారు. అయితే, వ్రాయబడిన చరిత్ర, వేదాంతం, కథల పుస్తకాలన్నింటిలోనూ తన ఖ్యాతి, తన పూర్వీకుల ఘనత గురించే ఉంటుందని సీవాంగ్‌టీకి నమ్మకం కుదరలేదు. చక్రవర్తినే విమర్శించడానికి సాహసించే రచయితలున్నా ఉండవచ్చు. ఎవరికి తెలుసు?

ఏమైనా సరే, తమకు సంబంధంలేని విషయాలని ప్రజలు చదవడం, వాటిలో శ్రద్ధ చూపడం అనవసరం అనుకున్నాడు సీవాంగ్‌టీ. వాళ్లెక్కువ కష్టపడాలి, రాజభక్తి కలిగి ఉండాలి, పన్నులు చెల్లిస్తూండాలి. అప్పుడే శాంతిని కాపాడడానికి వీలవుతుంది.

అందుచేత పుస్తకాలన్నింటినీ నాశనం చేయవలసిందిగా ఆజ్ఞాపించాడు. ఆ రోజుల్లో పుస్తకాలు, అక్షరాలు చెక్కబడిన కొయ్య దిమ్మలుగా ఉండేవి. వాటిని దాచడం కష్టం. చక్రవర్తిగారి మనుష్యులు రాజ్యమంతటా, ఊరూరా, వాడవాడలా గాలించి, దొరికిన పుస్తకాలను దొరికినట్టుగానే భోగి మంటలు వేశారు. చైనా దేశపు పెద్ద గోడ ఆ రోజుల్లోనే కట్టబడుతోంది. పెద్ద పెద్ద గుండ్రని కొయ్య దిమ్మలుగా

ఉండే ఎన్నో గ్రంథాలను రాళ్ళకి బదులుగా ఆ గోడలో తొడిగేశారు. తమ గ్రంథాలని వదలిపెట్టడానికి ఇష్టపడని పండితులను కూడా వారి వారి గ్రంథాలతోపాటే ఆ పెద్ద గోడలో పూడ్చి పెట్టేశారు.

సంవత్సరాలు గడిచాయి. ఆ చక్రవర్తి చనిపోయాడు. ఆయన చనిపోయిన కొన్ని సంవత్సరాలకే, నాశనం అయిపోయాయి అనుకున్న పుస్తకాల్లో చాలా భాగం మళ్లీ వెలుగులోకి వచ్చాయి కొత్త కొయ్య దిమ్మలమీద చెక్కబడ్డాయి. వాటిలో ఈనాడు ప్రపంచంలో అనేకులు చదివే ప్రముఖ వేదాంతి కన్‌ఫ్యూషియస్ రచనలు కూడా ఉన్నాయి.

గ్రంథాలను నాశనం చేయడానికి జరిగిన ప్రయత్నాలలో ఇది కేవలం ఒకటి మాత్రమే.

ఏడవ శతాబ్దిలో నలందా విశ్వవిద్యాలయం ఉచ్ఛదశలో ఉండే రోజులవి. చైనా వేదాంతి, యాత్రికుడు హ్యూయాన్‌త్సాంగ్ అక్కడ చదువు కుంటూండేవాడు. సుందరమైన విశ్వవిద్యాలయ భవనాలు మాయమై పోయినట్టు, అధ్యాపకులు, విద్యార్థుల బదులు ఆ ప్రదేశమంతా బఱ్ఱెలతో నిండిపోయినట్టు ఆయనకు ఒకనాటి రాత్రి కల వచ్చింది. దండయాత్రలు



చేసినవారు ఆ విశ్వవిద్యాలయంలోని గ్రంథాలయపు మూడు విభాగాలను తగలబెట్టడంతో ఆ కల నిజమైంది.

ప్రాచీన పట్టణం అలెగ్జాండ్రియాలో ఒక పెద్ద గ్రంథాలయం ఉండేది. ఎన్నో దేశాల నుంచి సేకరించిన వ్రాతప్రతులు ఆ గ్రంథాలయంలో ఉండేవి. భారతదేశం లాంటి ఎన్నో దేశాల ప్రజలు వందల కొద్దీ అక్కడకు వెళ్లి వాటిని చదువుకునే వారు. కాని, ఆ అమూల్యమైన గ్రంథాలయం ఏడవ శతాబ్దంలో మంటలకు ఆహుతై పోయింది. తమ పవిత్ర మత గ్రంథంలో చెప్పబడిన విషయాలు



ఈ గ్రంథాలలో వేటిలోనూ లేనందున వీటిని ఉంచనక్కర.లేదనీ, ఒక వేళ పవిత్ర గ్రంథాలలో చెప్పిన విషయాలు వీటిలో ఉంటే, ఇక వీటి అవసరమే లేదనీ వీటిని నాశనం చేసిన దండయాత్రికుడు వాదించాడు.

ఇలాగ ఎన్నోసార్లు గ్రంథాలు నాశనం చేయబడ్డాయి. కాని, అలా నాశనమైపోయిన ఎన్నో గ్రంథాలు తమ పాత రూపంలోనో, కొత్త రూపంలోనో తిరిగి వెలుగులోనికి వచ్చాయి. పుస్తకాలనేవి మానవుని బుద్ధి, అనుభవం, తెలివితేటలు, భావన, ఊహ, దృక్పథాల ఆధారంగా సృష్టించబడినవి. కాబట్టి, పుస్తకాలు నాశనమైపోయినా, మానవుని లోని ఈ గుణాలు మాత్రం నిలచి ఉంటాయి. రెండవ శతాబ్దంలో, తాను రచించిన జ్ఞాన గ్రంథంతోపాటే సజీవ సమాధి చేయబడిన డేనిష్ మత గురువు బెన్ జోసఫ్ అకీబా తన కడవటి మాటల్లో 'కాగితాలు కాలినా, మాటలు ముందడుగు వేస్తాయి' అన్నారు.

పుస్తకాలను ప్రాణప్రదంగా కాపాడుకునేవారు ఎందరో ఉన్నారు. ఎలాంటి అవాంతరం వచ్చినా, వారు తమకు నచ్చిన పుస్తకాలను భద్రంగా దాచుకోవాలనే ప్రయత్నం చేస్తారు. భారతీయ సంప్రదాయాన్ని బట్టి చూసినా, భగవంతుడికి గ్రంథాలంటే మక్కువ ఎక్కువ అని తెలుతోంది. జల ప్రళయం ఏర్పడి, నీటివల్ల సమస్తమూ నాశనమైపోయిన సమయంలో భగవంతుడు మత్స్యావతారం ఎత్తి, వేదాలను కాపాడేడు. పుస్తకం ఆమూలాగ్రంగా కంఠస్థం చేయడంవల్ల, తమకు ప్రీతిపాత్రమైన పుస్తకం పోయినా పట్టించుకోని వారూ ఉంటారు.

పూర్వకాలంలో పుస్తకాలను భట్టీపట్టే ప్రజ్ఞ కొందరికుండేది. క్రీస్తుకు పూర్వం 900 సంవత్సరాలనాడు నివసించిన గ్రీకు కవి హోమర్ రచించిన ఇలియడ్, ఒడెస్సీ గ్రంథాలను ఒక వృత్తిగా, కంఠోపాఠం చేసి వప్పచెప్పగల వ్యక్తులు తరతరాలుగా ఉన్నారు. ఈ రెండు గ్రంథాలూ కలసి 28,000 పంక్తులుంటాయి. ఇంతకు నాలుగు రెట్ల విషయాన్ని కూడా కంఠోపాఠ క్రమంలో వప్పచెప్పగల తపస్వులూ ఉన్నారు. జ్ఞాపకశక్తిని గురించి చెప్పుకున్నప్పుడు వెంటనే మనకు స్ఫురించేవి కేవలం భారతదేశంలోనే కాకుండా, కొందరి అభిప్రాయ ప్రకారం

ప్రపంచంలోనే ఆదిమ గ్రంథాలుగా చెప్పబడే వేదాలు. ఎంతో కాలంపాటు వేదాలలో ఉండే శ్లోకాలు ఎక్కడా వ్రాయబడి ఉండక, అనుశ్రుతంగా తండ్రి నుంచి కొడుకుకో, గురువు నుంచి శిష్యునికో వ్యాపించాయి.

వేదాలు ప్రాచీనమైన సంస్కృత భాషలో వెలువడ్డాయి. భారత



దేశంలో మనకెన్నో భాషలున్నప్పటికీ, పూర్వకాలంలో దేశమంతటా సంస్కృత భాషే వాడుకలో ఉండేది. దేశంలోని మూల మూలలనుంచి కవులు, పండితులు భారతీయ సాహిత్యానికి సంస్కృత భాష ద్వారానే సేవ చేశారు.

ప్రాచీన భారతదేశపు వేదాంత విజ్ఞాన విషయాలు సుదూర తీరాలకు వ్యాపించాయి. వాటితోపాటే హిమాలయాలను దాటి, సముద్రాలను దాటి కథా సరిత్సాగరము, పంచతంత్రము, జాతక కథలవంటి భారతదేశపు కథల పేటికలు దూరదేశాలకు ప్రయాణించాయి. బైబిలు కథలకు, గ్రీసులోని ఈసోపు కథలకు, జర్మనీలోని గ్రిమ్ సోదరులు సేకరించిన జానపద కథలకు, డెన్మార్కుకు చెందిన హాన్స్ ఆండర్సన్ చెప్పిన కథలకూ మూలం భారతదేశమేనని చాలామందికి తెలుసు.

భారతదేశపు పూర్వ సంస్కృతి చాలా గొప్పది. ఆ రంగుల ఉద్యానవనానికి కిటికీ వంటిదే ఈ పుస్తకం. మేం మీకిక్కడ పరిచయం చేయబోయే గ్రంథాలతోపాటే, గీత, యోగవాసిష్ట, త్రిపిటక, ధమ్మపాద, గ్రంథసాహెబ్, జ్ఞానేశ్వరి వంటి పుస్తకాలను కూడా ముందు ముందు మీరు చదివి ఆనందించగలరు.



# వేదాలు

భగవంతుడు, ఆనందము, సత్యం అనే ఉన్నతమైన విషయాలను అర్థం చేసుకోవడానికి, ఈ సమస్యలకు సమాధానాన్ని అన్వేషించడానికి మానవుడు చేసే ప్రయత్నాల సారాంశమే వేదాలు.

చాలాకాలం వరకూ వేదాలను శ్రుతులు అని పిలిచేవారు. మామూలుగా దీని అర్థం "వినవచ్చేవి" అని. కానీ, దీని అంతరార్థం "వెల్లడించిన నిజం" అని. తాము తపస్సులో ఉన్నప్పుడు ఋషులకు ఆధ్యాత్మిక శక్తి వెల్లడించినట్లు చెప్పిన విషయాలే వేదాల్లో ఉన్నాయి. వశిష్ఠుడు, విశ్వామిత్రుడు, అత్రి, పరాశరుడు, కణ్వుడు, మధుచ్ఛందుడు మొదలైన వైదిక ఋషులలో కొందరు పురాణాలు, పురాతన కథలు, గాథలలో మనకి కనిపిస్తారు. వారి పేర్లు మనకి పరిచితమైనవే. కాబట్టి వేదాలకు మూలకారకులైన వారితో మనకున్న సంబంధం వేళ్లు పాతుకుపోయింది.

మానవుడికి దేహము, బుద్ధితోపాటు ఆత్మ అనబడే అంతఃశక్తి కూడా ఉందని వేద ఋషులు నమ్మారు. ఈ అంతఃశక్తిని అన్వేషించడం అంటే తన్ను తాను తెలుసుకోవడం అన్న మాట. తనను తాను తెలుసుకున్నవాడు మాత్రమే ఋషి, జ్ఞాని అయినాడు. తాను కావాలనుకుంటే ఈ ఆత్మజ్ఞానాన్ని సంపాదించుకోవడానికి ఇతరులకు సహాయపడేవాడు. తన చుట్టూ నేలపై కూర్చున్న శిష్యులకు వల్లె వేసే విధానంలో ఈ ఋషి బోధిస్తూంటే వాళ్లు రోజుకు కొన్ని గంటల

చొప్పున వేదాలలోని శ్లోకాలను ఒకదాని తర్వాత ఒకటిగా చెప్పుకు పోయేవారు.

వేదాలు ఎటువంటి మతాన్ని గాని, దురభిమానాన్ని గాని బోధించవు. ఋషుల అంతర్గతమైన అనుభవాలను అవి యధాతధంగా చిత్రిస్తాయి. దూరదేశాలకు వెళ్లే ఒక యాత్ర, లేకపోతే పర్వతారోహణ వంటి మన అనుభవాలను మనం వర్ణించి చెప్పుకున్నట్లుగా ఆ అనుభవాలు వర్ణించబడలేదు. తమ తపస్సులో ఆ ఋషులు పొందిన అనుభూతుల్ని మనం మామూలు మాటల్లో వర్ణించి చెప్పలేం. అందుకని వారు సంకేత భాషను వాడారు. అంటే వేదాల్లో వాడిన మాటలకు పైకి కనిపించే అర్థం ఒకటైతే నిగూఢార్థం ఇంకొకటి ఉంటుందన్నమాట.



దీనికి రెండు ఉదాహరణలు చెప్తాను. ఉష అనే మాటకు ప్రాతఃకాలము అని అర్థం. కాని వేదాల్లో, మేఘాలతో ఆవరించబడిన మానవుని మనస్సులోకి దివ్యజ్యోతస్సుల్ని తెచ్చే దేవతామూర్తి అని అర్థం. అగ్ని అనే మాటకు నిప్పు అని మామూలు అర్థం అయితే, వైదిక పరిభాషలో దీని అర్థం భక్షకుడు, పవిత్రకారుడు అనే కాకుండా, సత్యం వైపు మానవుని నడిపించగల ఇచ్ఛగా, శక్తిగా, బలంగా చెప్పుకుంటాం.

కాని, కవియైన వ్యాసుడు వేదాలను ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణ వేదము అని నాలుగు తరగతులుగా విభ

టించాడు. వివిధ దేవతలను స్తుతించే పాటలు, వివిధ యజ్ఞయాగాది కర్మలకు సంబంధించిన వచన భాగాలు, అగోచరమైన వాటిని గురించి ఉన్నతస్థాయిలో ఆలోచించగల వేదాంత విషయాలు వీటిలో ఉన్నాయి.

వేదాలు ఎప్పుడు వ్రాయబడ్డాయి? ఈ ప్రశ్నకి ఎన్నో రకాల సమాధానాలు వున్నాయి. వీటిలో ఏ ఒక్కటైనా సరియైనదా కాదా అని



తేల్చి చెప్పడం కష్టం. క్రీస్తుకు పూర్వం 2500 ప్రాంతంలో ఇవి వ్రాయబడ్డాయని కొందరు పండితుల అభిప్రాయం. కాని, 6000 సంత్సరాలకు పూర్వమే ఇవి వ్రాయబడ్డాయని నమ్మిన బాన్‌కు చెందిన హెచ్. జాకోబీ, లోకమాన్య తిలక్ వంటి వారు కూడా ఉన్నారు. వేదాల్లో వర్ణించబడ్డ ప్రకారం గ్రహాల స్థానాల పరిశీలనలమీద తిలక్ నిర్ణయాలు ఆధారపడి ఉన్నాయి. కాని, మేడమ్ బ్లావాట్‌స్కీ అనే మరొక విద్వాంసురాలు వేదాల్లో వర్ణించబడిన గ్రహస్థానాలు ప్రతి 6000 సంవత్సరాలకి ఒకసారి పునరావృతమౌతాయి అన్నారు. కాబట్టి వేదాలు 60,000 సంవత్సరాలకి పూర్వమే వ్రాయబడి ఉండలేదని ఎలా నిశ్చయించగలం? ఊహకందనంత ఎంతో పూర్వం అవి వ్రాయబడినాయని ఆమె వ్యక్తిగత అభిప్రాయం.

విజ్ఞాన శాస్త్రాన్ని విశ్వసించడానికి ఎంతో పూర్వమే మానవసృష్టి జరిగిందని భారతీయ సంప్రదాయం ద్వారా తెలుస్తోంది. ఒకానొకసారి బ్రహ్మాండమైన ప్రళయం వచ్చిందనీ, జీవసృష్టి ఇతర వస్తువులన్నీ మునిగిపోయి నాశనమైపోయాయనీ పురాణాలు చెప్తుంటాయి. ఎలాగైతేనేం విష్ణువు ఆ [illegible] ప్రవేశించి వేదాలను కాపాడేడట.



ఎంతో పూర్వం ఒకానొకప్పుడు ఉండే నాగరికతకు వేదాలు నిదర్శనాలని ఈ గాథవలన మనం తెలుసుకోవచ్చా?

వేదాలు, వ్రాయబడక పూర్వం చాలా కాలంపాటు ఒక తరాన్నించి మరొక తరానికి అనుశ్రుతంగా అంటే వాక్కు ద్వారానే వ్యాపించాయి. వేదాలలో వాడబడిన భాష ఎంతో పటిష్ఠమైనది. అతి తక్కువ మాటల్లో ఎంతో విషయాన్ని చెప్పడానికి అనువైనది. ఇంతటి బలాన్ని సంపాదించు కుందంటే ఆ భాష ఎంతో కాలంనుంచీ వాడుకలో ఉండి ఉండాలి. ఎంతో గొప్ప నాగరికతగాని అటువంటి భాషను అలవరచుకోలేదు.

జ్ఞానుల జ్ఞానాన్ని మానవుడు అలవరచుకొనిన నాడే వేదాల అర్థాన్ని అవగాహన చేసుకోవడానికి వీలుంటుందని అంటారు. కాబట్టి వేద సృష్టికి కారణమైన అనాటి నాగరికతను గురించి విశేషంగా తెలుసుకోవడానికి, అందరి జ్ఞానాన్ని శ్లోకాల రూపంలో సరియైన విధంగా అర్థం చెసుకోవడానికి తగిన రోజు రాగలదని ఆశిద్దాం.



# ఉపనిషత్తులు

అనగనగా చాలాకాలం క్రిందట వజ్రసవాసుడు అనే ఒక ఋషి ఉండేవాడు. ఆయన ఒక అసమాన్యమైన యాగాన్ని చేయాలనుకున్నాడు. ఆ యాగం యొక్క నియమం ప్రకారం యాగకర్త తనకున్న యావదాస్తినీ, తన సర్వస్వాన్నీ కూడా పురోహితులకీ, బీదకీ బిక్కకీ దాన రూపంలో ఇచ్చేయాలి.



ఆ ఋషికి నచికేతుడనే కొడుకుండేవాడు. తన తండ్రి సర్వస్వాన్నీ దానం చేసేస్తున్నాడు కనుక తనను కూడా ఎవరికైనా ఇచ్చేసి ఉండాలని నచికేతుడు అనుకున్నాడు.

అతిథులకు ఆ ఋషి తన ఆస్తిపాస్తులను పంచిపెడుతున్న సమయంలో నచికేతుడు అక్కడకి వెళ్లి 'నన్నెవరికిచ్చారు నాన్నా' అని ప్రశ్నించాడు.

ఆ ఋషి జవాబు చెప్పలేదు. నచికేతుడు ప్రశ్నిస్తూనే ఉన్నాడు. చివరికి ఋషి విసిగిపోయి, ఒక్కసారిగా, 'నిన్ను యముడికి ఇచ్చేశాను' అన్నాడు.



యముడు ఎంతో భయంకరమైన మృత్యువుకు దేవుడు. ఋషి మాటలు విని అక్కడి వాళ్లంతా ఆశ్చర్యపోయారు. ఋషి కూడా తన మాటలకు తానే హడలిపోయాడు. ఒక్క నచికేతుడు మాత్రం ఎంత మాత్రం జంకలేదు. 'నేనేం తప్పు చేశానని నా తండ్రి నా చావును కోరుతున్నాడు? బహుశా యమధర్మరాజును చూడాలని నా అదృష్టంలో వ్రాసి పెట్టి ఉందేమో', అని తనని తాను సమాధాన పరచుకున్నాడు.

నచికేతుడు యమధర్మరాజు రాజ్యానికి బయలుదేరాలని సిద్ధమయ్యాడు. వజ్రసవాసుడూ ఇతరులూ కూడా అతని మనస్సును మార్చాలని ప్రయత్నించారు. కాని, 'నేను యముడి దగ్గరకు వెళ్లి తీరాల్సిందే' అని నచికేతుడు మంకుపట్టు పట్టి, బయల్దేరి వెళ్లిపోయాడు.

నచికేతుడు వెళ్లేసరికి యముడు రాజ్యంలో లేడు. అందువలన ఈ కుర్రాడు మూడు పగళ్ళూ, మూడు రాత్రుళ్ళూ అన్నపానాదులు మాని కాచుక కూర్చున్నాడు. యముడు తిరిగివచ్చి, ఈ కుర్రవాడి సాహసానికీ పట్టుదలకీ ఎంతో సంతోషించాడు. 'నువ్వు మూడు రోజులుగా అనుభవించిన ఈ బాధలకు గాను నేను నీకు మూడు వరాలను ఇస్తున్నాను. ఏం కావాలో కోరుకో' అన్నాడు.



'నేను యిల్లు వదిలిపెట్టినప్పటి నుంచీ నా తండ్రి ఎంతో దుఃఖంతో ఆదుర్దాతో ఉండి ఉంటారు. ఆయనకు పూర్వపు మనశ్శాంతిని ప్రసాదించండి' అని కోరేడు. యముడు సరేనన్నాడు.

తర్వాత, నచికేతుడు ముసలితనమన్నా, చావన్నా భయంలేని స్వర్గాన్ని చేరుకోవడానికి రహస్యోపాయం అడిగేడు. యముడు సంతోషంగా చెప్పేశాడు.

నచికేతుడు తన చివరి కోరికగా 'చావులోని అంతరార్థం ఏమిటి? చనిపోయినతర్వాత ఏం జరుగుతుంది? అమరుడు కావడం ఎలాగ?' అని అడిగాడు.



యముడు సందిగ్ధంలో పడ్డాడు. ఇవన్నీ ఎంతో రహస్యమైన విషయాలు. ఒక్క దేవుడికి తప్ప వీటిని గురించి వివరాలేం తెలియవు. కాబట్టి నచికేతుణ్ణి యముడు, సంపద కాని, అధికారం కాని, రాజ్యం కాని, మరేదయినా కోరుకోమన్నాడు. నచికేతుడు ఎలాంటి ప్రలోభానికి లొంగలేదు. మరణం యొక్క అంతరార్థాన్నీ, అమరత్వం యొక్క రహస్యాన్నీ ఛేదించి తీరాలనుకున్నాడు.

ఇలాంటి అతిరహస్య విషయాలను తెలుసుకోవడంలో ఈ కుర్రాడికున్న ఆసక్తికి యముడు ఆశ్చర్యపోయాడు. నచికేతుని ప్రశ్నలకి జవాబు చెప్పక తప్పింది కాదు. ఆత్మని తెలుసుకోవడంలో ఉండే కష్టం ఎలాంటిదో విడమరిచి చెప్పాడు. తనను తాను తెలుసుకున్నవాడికి చావనేది మిథ్య అనీ, ఆత్మ ఎప్పుడూ నశించదనీ తెలిసిపోతుంది.

నచికేతుని కథ ఉపనిషత్తులనుంచి తీసుకోబడింది. మనకు గుర్తు తెలియని కాలంనుంచీ ఆత్మజ్ఞానాన్ని తెలుసుకోవాలని తహతహలాడే ఎందరో ఉత్సాహవంతులైన యువకులు మనకి ఉపనిషత్తుల ద్వారా పరిచయమవుతారు.

ఎంతో కాలానికి పూర్వం మన దేశంలో ఉండే విశైక విద్యావిధానపు ఛాయల్ని మనం ఉపనిషత్కథల ద్వారా తెలుసుకోగలుగుతాం. తన సర్వస్వాన్నీ విడిచిపెట్టి విద్యార్థి గురువుతోపాటే అడవుల్లో ఉండేవాడు. విద్యార్జనే లక్ష్యంగా పెట్టుకునేవాడు. అతని విద్య కేవలం గ్రంథ పఠనం వరకే పరిమితం కాకుండా కఠోర తపస్సు, యోగము, శరీర శ్రమలకు కూడా విస్తృతమై ఉండేది.

మన దేశం యొక్క సాహిత్యపరమైన వారసత్వంలో వేదాల తర్వాత ప్రాముఖ్యతలో ఉపనిషత్తులనే చెప్పుకోవాలి. వాటిని వేదాల యొక్క అంతంగా, అంటే వేదాంతంగా, మనం భావిస్తాం. కాబట్టి, పండితులు వాటిని వేదాలయొక్క భాగంగానే నిర్ణయించారు. కాని వాటిని వేదాలలో ఉండే కొన్ని అభిప్రాయాల వివరణ అంటేనే బావుంటుందేమో ? ప్రతి ఉపనిషత్తులోని విషయమూ ఏదో ఒక పథానికి సంబంధించినదై ఉంటుంది. చాలా ఉపనిషత్తులు వేదకాలం చివరి భాగంలో

వ్రాయబడ్డాయి. కొన్ని మాత్రం ఆ తర్వాతి కాలంలో వెలువడ్డాయి. మొత్తం 108 ఉపనిషత్తులున్నాయి. వాటిలో ముఖ్యమైనవి ఈశోపనిషత్తు, కేనోపనిషత్తు, కఠోపనిషత్తు, మాండూక్యోపనిషత్తు, ముండూకోపనిషత్తు, ప్రశ్నోపనిషత్తు.

వేదాలలోనూ, ఉపనిషత్తులలోనూ చెప్పబడిన ముఖ్య సందేశం 'నిన్ను నువ్వు తెలుసుకో' అని. దీన్ని ఆచరించడం చాలా కష్టం. అందుకే ఉపనిషత్తులలో ఇలా చెప్పబడింది :

'చాలామంది ఆత్మ అనే మాటను విని యుండరు. కొందరు విన్నప్పటికీ అర్థం చేసుకొని ఉండరు. అలాంటివారు ఆ మాట గురించి చెప్పినప్పుడు ఆశ్చర్యం కలుగుతుంది. దాన్ని గురించి తెలుసుకొన్నవాడే ప్రజ్ఞాశాలి. చక్కని గురువు దగ్గర దాన్ని గురించి తెలుసుకొని, అర్థం చేసుకొన్నవాడు అదృష్టవంతుడే.'

కాని, ఉపనిషత్తులను సృష్టించినవారు తప్ప వీటిని గురించి ఎవరు బాగా బోధించగలరు? దీని రహస్యాన్ని వారే విడమర్చి విశదంగా చెప్పగలరు. ఉదాహరణకి-

ఒకసారి యాజ్ఞ్యవల్క్య ముని వేదాంత విషయాలలో జనక మహారాజుతో చర్చ జరిపాడు. జనకుడు ప్రపంచ విషయాలు తెలుసున్న జ్ఞాని, చదువుకున్నవాడు. రాజును గురించి తెలుసుకొని ఆనందించిన యాజ్ఞ్యవల్క్యుడు ఆయనకో వరం ఇవ్వదలిచాడు.

రాజు తన జీవిత కాలమంతా వివిధ రచనల్ని అధ్యయనంచేసి వాటి లోతుపాతుల్ని తెలుసుకున్నవాడు. కాని ఆయన జ్ఞాన పిపాస ఇంకా తీరలేదు. ఇంకా ఇంకా తెలుసుకోవాలనే ఉద్దేశంతో ఆయన యాజ్ఞ్యవల్క్యుణ్ణి, 'మానవుల్లో జ్యోతి ఏది?' అని ప్రశ్నించాడు.

'సూర్యుడు. ఎందుకంటే, ఆయన వెలుగులోనే మానవుడు చూడగలుగుతున్నాడు. పనిపాటలు చేసుకోగలుగుతున్నాడు. తిరిగి ఇంటికి రాగలుగుతున్నాడు,' అని జవాబిచ్చాడు యాజ్ఞ్యవల్క్యుడు.

'యాజ్ఞ్యవల్క్య, మీరు చెప్పింది నిజమే కావచ్చు. కాని, సూర్యుడు



అస్తమించిన తర్వాత, మరి మానవునికి వెలుగేది ?' అని ప్రశ్నించాడు జనక మహారాజు.

'చంద్రుడు. ఎందుకంటే, ఆయన వెలుగులోనే మానవుడు చూడ గలుగుతున్నాడు. పనిపాటలు చేసుకుంటున్నాడు. తిరిగి ఇంటికి రాగలుగుతున్నాడు' చెప్పాడు, యాజ్ఞ్యవల్క్యుడు.

'యాజ్ఞ్యవల్క్యా, మీరు చెప్పింది నిజమే కావచ్చు, కాని, సూర్యుడు చంద్రుడూ అస్తమించిన తర్వాత మరి మానవునికి వెలుగేది ?' తిరిగి జనక మహారాజు ప్రశ్న.

యాజ్ఞ్యవల్క్యుడు జవాబిచ్చాడు, 'అగ్ని' అని. ఎందుకంటే ఆయన వెలుగులోనే మానవుడు చూడగలుగుతున్నాడు. పనిపాటలు చేసుకో గలుగుతున్నాడు. తిరిగి ఇంటికి రాగలుగుతున్నాడు.

జనక మహారాజు మళ్లీ ప్రశ్నించాడు. 'యాజ్ఞ్యవల్క్యా, మీరు చెప్పింది నిజమే కావచ్చు. కాని, సూర్యుడూ చంద్రుడూ అస్తమించిన తర్వాత, అగ్ని ఆరిపోయిన తర్వాత, మరి మానవునికి వెలుగేది ?' అని.

'వాక్కు. ఎందుకంటే, దానివల్లనే మానవుడు చూడగలుగు తున్నాడు. పనిపాటలు చేసుకో గలుగుతున్నాడు. తిరిగి ఇంటికి రాగలుగుతున్నాడు. కాబట్టి, రాజా, తన చేతిని తాను స్వయంగా చూసు కోలేని వాడు, తనగాత్రాన్ని తాను స్వయంగా వినలేనివాడు మాత్రమే దానికోసం పరుగులు పెడతాడు,' అన్నాడు యాజ్ఞ్యవల్క్యుడు.



'అయితే కావచ్చును యాజ్ఞ్యవల్క్య, కాని, సూర్యుడూ, చంద్రుడూ అస్తమించిన తర్వాత, అగ్ని ఆరిపోయిన తర్వాత, మాట పడిపోయిన తర్వాత, మరి, మానవునికి వెలుగేది?' జనకమహారాజు తిరిగి ప్రశ్నించాడు.

యాజ్ఞ్యవల్క్యుడు జవాబిచ్చాడు, 'ఆత్మ' అని.



# రామాయణం

ఎన్నో పురాతన గ్రంథాలలో చెప్పబడిన అతి ప్రాచీన పురాతన అరణ్యం దండకారణ్యం కొండలతో, సెలయేళ్లతో ఇంకా ఉంది. పూర్వ కాలంలో అది గోదావరి, నర్మదా నదుల మధ్య ప్రదేశాన్ని ఆక్రమిస్తూ ఎంతో పెద్దదిగా ఉండేది.

ఇప్పటికి కూడా దట్టమైన అరణ్యాల గుండా బూడిదరంగు, తెలుపు రంగు గులకరాళ్లమీద నుంచి గలగలా నృత్యం చేస్తున్నట్లు పారుతూ తమసా నది మనకి కనిపిస్తుంది.

మూడువేల సంవత్సరాలకి పూర్వం ఈ నది ఒడ్డున ఒక గొప్ప ఋషి ఉండేవాడు. సంవత్సరాల తరబడి ఆయన, తన శరీరం చుట్టూ చీమల పుట్టలు పెరిగినా లక్ష్యపెట్టక చలించకుండా కూర్చుని తీవ్ర తపస్సు చేశాడు. చీమలు పుట్టను సంస్కృత భాషలో వల్మీకం అంటారు. చీమల పుట్టలోంచి ఈ ఋషి పైకి వచ్చాడు కాబట్టి ఈయన వాల్మీకి అయినాడు.

ఒకనాటి ఉదయం ఆ ఋషి తమసా నదిలో స్నానం చేసి తన కుటీరం వద్దకు తిరిగి పోతున్నాడు. ఒకదానినొకటి తరుముకుంటూ ఆటలాడుకుంటూన్న పక్షుల జంట ఆయన కంట పడింది. వాల్మీకి వాటిని చూస్తూ ఆగిపోయాడు. తక్కున, ఉన్నట్లుండి ఒక బాణం గాలిలో దూసుకువచ్చి వాటిలో ఒక దానిని తాకి దాని ప్రాణం తీసింది.



రెండవ పక్షి విచారంతోనూ బాధతోనూ రోదించింది.

వాల్మీకి కోపంతో ఊగిపోయాడు. కలతచెంది ఎంతో ఉద్రేకంతో మాట్లాడేడు. ఆయన మాటలు వేటగాని చర్యను కేవలం గర్హించడమేకాదు, మానవుడు ఎలా ప్రవర్తించాలో కూడా తెలిపాయి.

తన కోపం చల్లారిన తర్వాత, ఆ ఋషి, తాను ఉచ్చరించిన మాటలయొక్క లయకు అసామాన్యమైన శక్తి ఉందని తెలుసుకున్నాడు. చాలా కాలం నుంచి ఆయన తాను వ్రాయాలనుకున్న గ్రంథానికి సంబంధించిన విషయానికి అనువుగా కొత్త రీతిలో భావ ప్రకటన చేయాలను

కున్నాడు. ఇప్పుడు ఆయన ఉచ్చరించిన మాటల పొందిక ఆ పనిని సాధించగలదనుకున్నాడు.

ఆ ప్రకారంగా, వేటగానికి చెప్పిన మాటలవల్ల భావ వ్యక్తీకరణకు కొత్త రూపం వచ్చి శ్లోకం అయింది. వాల్మీకి మన ఆది కవి. ఆయన సంస్కృతంలో వ్రాసిన మహాకావ్యం మన సాహిత్యంలో మొట్టమొదటి వాస్తవ కావ్య రచన అయింది.

రామాయణం మహాకావ్యం. రామాయణ కథలను భారతీయ బాలురు ఏదో ఒక రూపంలో ఎరుగుదురు. ఏదో ఒక రూపంలో అని ఎందుకంటున్నానంటే, యుగ యుగాలుగా రామాయణంలోని ముఖ్య కథ ఎంతోమంది రచయితలకు కావ్యాలుగా, పద్యాలుగా, నాటకాలుగా, కథలుగా వ్రాయడానికి ప్రేరణను ఇచ్చింది. వారిలో ఉత్తరాదిని తులసీదాసు, దక్షిణాదిని కంబన్ అనే ఇద్దరు ప్రముఖ కవులు రామాయణాన్ని తమ తమ భాషల్లో వ్రాశారు. అవి ఆయా ప్రాంతాల్లో ఎంతో జనరంజకమైనాయి.

అన్ని భాషలలోనూ కథావస్తువు ఇంచుమించుగా ఒకటే. అయోధ్య యువరాజు రాముడు తన తండ్రి దశరధునిచే పట్టాభిషేకం చేయుంచుకోవడానికి ముందురోజు, దశరధుని ముగ్గురు రాణులలో ఒకరైన కైకేయి తనకు వాగ్దానం చేసిన రెండు వరాలను గురించి దశరధునికి జ్ఞాపకం చేస్తుంది. దశరధుడు ఆమెకు ఆ వరాలనిస్తానని చెప్తాడు.



కైకేయి వెంటనే తన కుమారుడు భరతుడు దశరధుని తర్వాత సింహాసనం ఎక్కాలని, రాముడు పధ్నాలుగేళ్లు అరణ్యవాసం చేయాలనీ కోరుతుంది. రాజు ఆశ్చర్యపోయి, ఆమెను మరే వరాలనైనా కోరుకోమని అడుగుతాడు. కాని ప్రయోజనం లేకపోతుంది.

తన తండ్రి ఇచ్చిన మాటను నిలబెట్టుకోవ

డానికి, చేసిన వాగ్దానాన్ని పూర్తి చేయడానికి వీలుగా శ్రీరాముడు, తన భార్య సీత, తమ్ముడు లక్ష్మణుడు వెంటరాగా, అయోధ్య వదలి వెళ్లిపోతాడు.

కొంత కాలానికే దశరధుడు దుఃఖంతో మరణిస్తాడు. తప్పని సరిగా దుఃఖంతోనే భరతుడు శ్రీరాముని స్థానే అయోధ్యను పరిపాలిస్తాడు.



సీతా లక్ష్మణులు వెంటరాగా, అడవిలోని పవిత్రమునులను శత్రువులుగా ఎంచిన అనేకమంది రాక్షసులను చంపుతూ, శ్రీరాముడు దండకారణ్యంలో ప్రయాణాన్ని సాగిస్తాడు. లంకాద్వీపాన్ని పరిపాలిస్తున్న రాక్షస రాజు రావణుడు రాముని మీద పగ సాధించాలనుకుంటాడు. సీతను మోసంచేసి తన ద్వీపానికి తీసుకుపోతాడు.

చాలా కాలం వెదకి వెదకి చివరకు రాముడు వానర సైన్యం సహాయంతో రావణుని కోటను ముట్టడించి, అతనిని చంపి, సీతను రక్షిస్తాడు.

పధ్నాలుగేళ్లు గడుస్తాయి. రాముడు, సీత అయోధ్యకు తిరిగి వస్తారు. రాముడు సింహాసనమెక్కి ఆదర్శ ప్రభువుగా ఖ్యాతి నార్జిస్తాడు.

ఇంతలో ఒకనాడు, 'రాక్షసుడి కోటలో ఉన్న సీతను తన రాణిగా స్వీకరించడం



ఏం బావుంది' అని తన ప్రజలలో అనుకోవడం ఆయన చెవిన పడుతుంది.

రాముని ఆజ్ఞ మేరకు లక్ష్మణుడు సీతను తీసుకువెళ్లి వాల్మీకి ఆశ్రమం దగ్గర అడవిలో వదలేస్తాడు.

వాల్మీకి సీతను ఆహ్వానించి తన ఆశ్రమంలో రక్షణ ఇస్తాడు. కొంత కాలానికి సీతకు కవలపిల్లలు లవకుశులు పుడతారు.

వాల్మీకి చెప్పుచేతలలో ఈ ఇద్దరు బాలురు తెలివితేటలలోనూ, వివిధ విద్యలలోను ఆరితేరతారు. ఆ రోజులలో వాల్మీకి రామాయణ రచన చేస్తున్నాడు. ఒకనాడు ఆయన లవకుశులను శ్రీ రాముని భవనానికి తీసుకువెళ్లి ఆ కావ్యాన్ని పాడించాడు. రాముడు తన కుమారులను గుర్తుపట్టినప్పుడు ఎంతో ఆనందించాడు. సీతను తిరిగి రప్పించడానికి ఏర్పాట్లు చేశాడు.

సీత అయోధ్యకు తిరిగి వచ్చిన తర్వాత, తన పవిత్రతను నిరూపించుకోవడాని ఆమె అగ్ని పరీక్షకు నిలవాలన్నారు. కాని సీతకు జీవించా



లన్న ఆశ లేదు. తాను పవిత్రురాలే అయితే తనను తనలోనికి తీసుకోమని ఆమె భూమాతను ప్రార్థించింది.

తక్షణమే భూమాత విచ్చుకుంది. అనుమానించే వ్యక్తులకు తగనని తన పవిత్రతను నిరూపించుకుంటూ సీత ఆ భూమిలో అదృశ్యమై పోయింది.

రామాయణానికి లోతైన అర్థం ఉంది. నోరు మెదపకుండా బాధలను అనుభవించిన సౌజన్యమూర్తి, సుందరి సీత యుగయుగాలుగా దేవతామూర్తిగా పరిగణింపబడుతోంది. అసత్యానికి ప్రతిరూపమైన రాక్షసుడు రావణుని బారినుండి, సత్యాన్వేషి రాముని వల్ల కాపాడబడిన సత్య స్వరూపమే సీత. తమ సంకుచిత మనస్తత్వం వల్లనే మానవులు ఆ సత్యాన్ని దూరం చేసుకున్నారు.

ప్రపంచ సాహిత్యంలోని కావ్య నాయకులలో రాముడు అసమాన్యుడు. అణకువకూ, కర్తవ్య పరాయణత్వానికి ఆయన ఉదాహరణ. మారుమాటాడకుండా తండ్రి ఆజ్ఞను పాలించి ఆయన, రాజ్యానికిగల తన హక్కును వదలుకున్నాడు. సీతను కాపాడటంలో ఆయన తనకు చేతనైనన్ని ప్రయత్నాలనూ చేసి, కర్తవ్య పరాయణుడైన భర్తగా నిరూపించుకున్నాడు. ప్రజల అభిప్రాయాలను గౌరవించి, సీత పవిత్రత మీద నమ్మకం ఉన్నా, ఆమెను అడవులకు పంపించి, ప్రజలపట్ల తన కర్తవ్య పరాయణత్వాన్ని నిరూపించుకున్నాడు.

కాని, భారతీయులకు రాముడు ఇంతకంటె కూడా ఆరాధ్యుడే. ఆయన విష్ణుని అవతారాల్లో ఒకడు. నిజానికి ఆయన భరతుని సహాయాన్ని ఆపేక్షించకుండా, వానరసేనను నడపడం ఆయన ప్రత్యేకతను దాటుతుంది. రాముడు కోరిందల్లా పరిపూర్ణమైన శక్తిప్రపత్తులు. ఈ గుణాలు ఉండటం వల్లనే అంతకు పూర్వం ఏ శిక్షణాలేని వానరులు దశకంఠుడు రావణుని శక్తివంతమైన బలగాన్ని ఓడించగలిగారు. పది రకాల విద్యలలో నిపుణుడు కాబట్టే రావణుడు దశకంఠుడైనాడేమో ? రావణునిపై రాముని విజయం వలన మనం తెలుసుకోవలసిన నీతి ఇతరమైన శక్తులన్నింటికంటె సత్యమే గొప్పదని.

నేటికి కూడా వందలాది జాతరబృందాలూ, జానపదబృందాలు రామాయణ గాథలను ప్రదర్శించి, ప్రేక్షకులను ఆనందింప చేస్తూంటారు. వెన్నెలలో రాత్రిపూట, రాముని కష్టాలనూ, హనుమంతుని శౌర్యాన్ని గురించి పాటలుపాడే వీధి గాయకుల చుట్టూ గ్రామస్థులు ఆత్రతతో గుమిగూడటం మనం ఈ నాటికీ చూస్తూనే ఉంటాం.

రాముడు ఆదర్శప్రభువు. ఆయన పరిపాలనా కాలంలో ప్రజలు సుఖ సంతోషాలతో ఉండేవారు. కాబట్టి నేటికీ స్వర్ణ యుగాన్ని గురించి చెప్పా లనుకున్నప్పుడు ప్రజలు 'రామరాజ్యం' అనే పదాన్ని వాడతారు. గ్రామ సమావేశాల్లో కాని, పంచాయితీలలో కాని సాధారణంగా తగాయిదాలను పరిష్కరించేటప్పుడు ప్రజలు సత్యానికి ప్రతిరూపమైన రాముని పేరటనే ప్రమాణాలు చేయడం పరిపాటి.

భారతీయ పర్వాలలో కొన్ని రాముని జీవితానికి సంబంధించినవి. దీపాలపండుగ దీపావళి విశేషగా రాముడు అయోధ్యకు తిరిగిరావడాన్ని రూపిస్తుంది. దుర్గాదేవిని ప్రార్థించి, రావణునిపై విజయాన్ని సంపాదించ డానికి రాముడు వరాన్ని పొందిన రోజును దసరాగా పరిగణిస్తారు.

భారతీయ భాషల్లో వ్రాయబడిన గ్రంథాలే కాకుండా అనేక విదేశీ భాషల్లో కూడా రామాయణం గ్రంథాలుగా ఉంది. 1500 సంవత్సరాలకు పూర్వం చైనాభాషలో రామాయణం వ్రాయబడింది. ఆ తర్వాత దానికి టిబెట్ భాషలో అనువాదం వెలువడింది.

థాయ్‌లెండు దేశంమీద రామాయణం ప్రభావం ఎంతగానో ఉంది. వారు తమ రాజధానికి రాముని రాజధాని అయోధ్య పేరిట 'అయోతియా' అని పేరుపెట్టుకున్నారు. ఇండోనీశియాలో రామాయణ కథల ప్రభావం ఎంతగానో ఉందని చెప్పడంలో అతిశయోక్తి లేదు. ఇండోనీసియా దీవులలో చూపబడే బొమ్మలాటలలో నేటికి కూడా సాధారణంగా రామా యణ కథలను వాడతారు. ఎన్నో సంవత్సరాలకు పూర్వం భారతీయ వ్యాపారస్థులు, సాంస్కృతిక బృందాలవారు రామాయణాన్ని దక్షిణ ఆసియా దేశాలకి తీసుకువెళ్ళారు. ఆ దేశములలోని కవులు రచయితలు

మూలకథకు తమ ఊహనూ, ఆ ప్రాంతంలోని గాథలనూ జోడించి ఆ కావ్యాన్ని వివిధ రీతుల్లో ఆకర్షణీయంగా రూపొందించారు.

ప్రపంచ సాహిత్య చరిత్రలో రామాయణానికి ఏకైక స్థానం ఉంది. తన దేశాన్ని దాటి మరి ఏ ఇతర కథ కాని, రచన కాని ఇన్ని రకాలుగా రూపొందలేదు.



# మహాభారతం

ఒకానొక గ్రామంలో ఒక చిన్న కుర్రాడు భయం కలిగించే పెద్ద మీసాలతో ఉన్న ఒక పొడుగాటి, బలమైన, దృఢమైన వ్యక్తిని చూశాడు. వాళ్ళమ్మ దగ్గరకు ఉత్సాహంతో పరుగెత్తుకుంటూ వెళ్ళి, 'అమ్మా, నేను భీముణ్ణి చూశాను' అని చెప్పాడు.

మహాభారతంలోని గొప్ప నాయకుల్లో భీముడు ఒకడని మీకు తెలుసు. రామాయణ, మహాభారతాల రచన జరిగి కొన్ని శతాబ్దాలు గడిచిపోయాయి. ప్రతి భారతీయ బాలుడికి వాటిలోని పాత్రలు ఇంకా సజీవంగా ఉన్నట్టే అనిపిస్తుంది. శంఖమో, చక్రమో చేతిలో పట్టుకున్న శ్రీకృష్ణుడు, మెరుస్తూండే పెద్ద విల్లును ధరించిన అర్జునుడు, బలాఢ్యుడైన భీముడు, బలిష్ఠుడైనా దయాసముద్రుడైన రాముడు, ఏ శ్రమా లేకుండా ఒక పర్వతాన్ని సైతం పెల్లగించి గాలిలో కొన్ని వందల మైళ్ళు మోసుకుని పోగల హనుమంతుడూ వారికి ప్రతిరోజూ తాము చూసే వ్యక్తులలాగే సహజంగా అనిపిస్తారు.

మహాభారత కథను సూక్ష్మంగా చెప్పుకోవాలంటే -

హస్తినాపురాన్ని పరిపాలించేవాడు శంతన మహారాజు. ధృతరాష్ట్రుడు, పాండుడూ అని ఇద్దరు మనుమలు ఉండేవారు. ధృతరాష్ట్రుడు గుడ్డివాడు. కాబట్టి పాండుడు శంతనుడి తర్వాత సింహాసనానికి వచ్చాడు.

కాని, శాపవశాత్తూ, పాండుడు తన ఇద్దరు భార్యలతోనూ చాలా కాలం అరణ్యవాసం చేయవలసి వచ్చింది. ఆయన అడవుల్లో ఉండగానే ఆయనకు ఐదుగురు కుమారులు కలిగారు. వాళ్ళు ధర్మరాజు, భీముడు,

అర్జునుడు, నకులుడు, సహదేవుడు. వాళ్లు అక్కడుండే జ్ఞానులైన మునుల దగ్గర చదువుకున్నారు.

పాండురాజు చనిపోగానే ఆయన భార్య, కుమారులు పాండవులూ హస్తినాపురానికి తిరిగి వచ్చారు.

దురదృష్టవశాత్తూ ధృతరాష్ట్రుని వంద మంది కుమారులూ కౌరవులకు పాండవులంటే అసూయ కలిగింది. వాళ్లు ఈ ఐదుగురు సోదరుల మీదా ఎన్నో కుతంత్రాలు పన్నేరు. శాంతం, క్షమా గుణం కల ధర్మరాజు వల్లనే పాండవులు వారికి ప్రతిక్రియ చేయలేదు.



ఎలా గైతేనేం, ఈ కుర్రవాళ్లు పెద్దవాళ్లయేసరికి, భీష్ముడు కలుగ చేసుకుని వాళ్లని ఒక అంగీకార యోగ్యమైన ఒప్పందానికి సమ్మతించే లాగ చేశాడు. కౌరవుల్లో పెద్దవాడైన దుర్యోధనుడు పూర్వపు హస్తినా పుర రాజ్యంలోని సగభాగాన్ని పరిపాలిస్తూండేవాడు. ఇంద్రప్రస్థపురం రాజధానిగా మిగిలిన సగభాగం రాజ్యాన్ని పాండవుల్లో పెద్దవాడైన ధర్మరాజు పరిపాలిస్తూండేవాడు.

కొన్ని సంవత్సరాలు ప్రశాంతంగానే గడచిపోయాయి. అంతలో ఒకనాడు కౌరవులు పాండవుల్ని జూదానికి రమ్మని కవ్వించారు. జూదంలో పాండవులు ఓడిపోయారు. ఒప్పుకున్న షరతు ప్రకారం పాండవులు రాజ్యాన్ని పదమూడేళ్లు వదలి వెళ్లిపోవాలి.

ఆ ప్రకారం వాళ్లు తిరిగి వచ్చిన తర్వాత దుర్యోధనుడు వాళ్లకి తమ రాజ్య భాగం ఇచ్చేయడానికి అంగీకరించలేదు. సమస్యను పరిష్కరించుకోవడానికి శాంతియుతంగా చేసిన అన్ని ప్రయత్నాలూ విఫలం



కాగా చివరకి కురుక్షేత్రం వద్ద రక్తపాతంతో కూడిన మహా సంగ్రామం ప్రారంభమైంది. యుద్ధానికి ముందురోజున అర్జునుడు తన బంధువుల రక్తపాతం చూడడానికి ఇష్టంలేక యుద్ధాన్నుంచి విరమించుకుంటానన్నాడు. కాని, శ్రీకృష్ణుడు, ఏ వ్యక్తిగతమైన దురాశా లేకుండా న్యాయం కోసం పోరాడడంలో తప్పులేదని అతనికి నచ్చచెప్పాడు.



శ్రీకృష్ణుడు అర్జునునికి చేసిన ఈ ఉపదేశమే భగవద్గీత. కొన్ని సంవత్సరాలుగా అనేకమందికి ఆధ్యాత్మిక శక్తిని ప్రసాదించినది ఈ గీతయే. యుద్ధ సమయంలో శ్రీకృష్ణుడే అర్జునునికి రథసారథిగానూ, మార్గదర్శిగాను వ్యవహరించాడు.

కౌరవులు ఓడిపోయారు. ధర్మరాజు రాజయ్యాడు.



కాని, భౌతికమైన ఈ విజయమూ ప్రగతీ వారికి ముఖ్యమైనవిగా అనిపించలేదు. కాబట్టి, 36 సంవత్సరాలు న్యాయంగా ధర్మంగా వారు పరిపాలన సాగించి, తమ మనుమడు పరీక్షిత్తుకు రాజ్యభారాన్ని అప్పగించి, హిమాలయాలకు వెళ్ళిపోయారు.

దారి తెలియని ఆ ప్రయాణంలో యుధిష్ఠరుని సోదరులూ, భార్యా ఒకరి తర్వాత ఒకరుగా అలసి సొలసిపోయారు, చనిపోయారు. యుధిష్ఠరుడొక్కడే మిగిలి ఉన్నాడు. అతడికి స్వర్గం ప్రాప్తించింది. అనేకమంది విశ్వసించినట్లు ఉన్నతోన్నతమైన ఆధ్యాత్మిక లక్ష్యాన్ని చేరుకోవడానికి ఈ శరీరం ప్రతిబంధకం కాదని దీనివలన తెలుస్తోంది.

మహాభారతంలో ఎన్నో కథలున్నాయి. వాటికెంతో ప్రాముఖ్యత ఉంది. మహాభారతంలాగ జీవితంలోని అనేక విషయాలను మనకు పరిచయంచేసే పుస్తకం ప్రపంచంలో మరొకటేది లేదు. "మహాభారతంలో లేనిదేదీ భారతంలో లేదు" అని ఒక నానుడి ఉంది. కాబట్టి మనం మహాభారతాన్ని భారతదేశము యొక్క స్థూలస్వరూపంగా చెప్పుకోవచ్చును.

మహాజ్ఞాని వ్యాసుడు మహాభారతాన్ని వ్రాశాడు. ఆయన ఈ కావ్యాన్ని వ్రాయాలనుకున్నప్పుడు, తాను ఆశువుగా చెప్తూంటే విని వ్రాయగలవారెవరైనా ఉంటే బాగుండుననుకున్నాడు. విఘ్నేశ్వరుణ్ణి ఈ విషయంలో తనకు సహాయం చేయవలసిందిగా కోరేడు. కవి నోటి నుండి కవితాప్రవాహం ఆగిపోయిన మరుక్షణమే తానుకూడా వ్రాయడం మానేస్తాననే నిర్ణయం మీద విఘ్నేశ్వరుడు వప్పుకున్నాడు. అయితే, అర్థం చేసుకోకుండా దేన్ని వినాయకుడు వ్రాయకూడదనే షరతును కవి పెట్టాడు.

ఆ ప్రకారం మహాభారతం 90,000 శ్లోకాలుగా పద్దెనిమిది పర్వాలుగా వ్రాయటం జరిగింది.

# పురాణాలు

వర్షాలు వచ్చాయి. మానవుని అహం ఆత్మను ఆవరించినట్టుగానే నీలమేఘాలు చంద్రుణ్ణి కప్పేశాయి. హుందాగా వర్షించింది. - అంతా నూతనంగా, శ్యామలంగా, సుందరంగా ఉంది.

"ఇంతలో గ్రీష్మం వచ్చింది. ఆకాశం, నీరూ కూడా తపోనిష్ఠలో ఉన్న మనస్సులాగే నిర్మలంగా ఉన్నాయి. అమాయకుల అబద్ధపు ఊహలలాగే దారిలోని బురద అంతా క్రమంగా మటుమాయమైంది. తనను తాను తెలుసుకున్న ఆత్మలాగే సముద్రం కూడా ప్రశాంతత వహించింది. వాస్తవ జ్ఞానంలాగే చంద్రుడు కూడా ప్రకాశించాడు."

పురాణాలలోకెల్లా ఎక్కువ ప్రజాదరణ పొందిన భాగవతంలో సారాంశమిది. మానవ మేధస్సు యొక్క స్థితులతో ప్రకృతి యొక్క స్థితులను కవి ఇక్కడ సరిపోల్చాడు. గ్రంథమంతా ఇదేమాదిరిగా రచన సాగుతుంది.

అటవీ మధ్యనుంచి దేవతామూర్తి బాలకృష్ణుని మధుమురళి విన వచ్చింది. మురళీ రవళిలోని మధురిమకు పరవశించి గోగణమూ, గోపాలురూ, గోపికలూ, చివరకు యమునానది కూడా మైమరిచి విన సాగేయి. దీన్ని కేవలం కవి భావనాశక్తిగా మాత్రమే మనం అర్థం చేసుకోకూడదు. దీని అంతరార్థం వేరే ఉంది. ప్రకృతీ, అనంత సృష్టీ, తమ అంతరాత్మలలో చేతావసిని పొందగల అపూర్వ దేవతా రవమే ఆ మురళీరవళి.



శ్రీకృష్ణుని జీవితంలోని అనేక ఘట్టాలను భాగవతం మనకు పరిచయం చేస్తుంది, ఇందలి ప్రతీ కథకూ ఒక నిగూఢార్థం ఉంది.

క్రీస్తుకు పూర్వం మొదటి శతాబ్దం, ఆరవ శతాబ్దం మధ్య కాలంలో వ్రాయబడినట్టు భావించబడుతున్న పురాణాలలో భాగవతం ఒకటి. కాని వేదవ్యాసునిచే వ్రాయబడినట్టి మూల పురాణం కనీసం ఒక్కటైనా అంతకంటె ఎంతో పురాతనమైనదై ఉండాలి. వ్యాసుని నుంచి ఉద్దేశం, ఉత్ప్రేరణ పొంది, ఆయన శిష్యులూ, ప్రశిష్యులూ మొత్తం ముప్పది యారు పురాణాలను వ్రాశారు. వీటిలో ముఖ్యమైనవాటిని మహాపురాణాలనీ, మిగిలిన వాటిని ఉపపురాణాలనీ అంటారు. మహా పురాణాలుగా చెప్పబడేవి - విష్ణు పురాణం, భాగవత పురాణం, నారదీయ పురాణం, గరుడ పురాణం, పద్మ పురాణం, వరాహ పురాణం, అగ్ని పురాణం, మార్కండేయ పురాణం, భవిష్య పురాణం, వామన పురాణం, వాయు పురాణం, లింగ పురాణం, స్కాంద పురాణం, మత్స్య పురాణం, కూర్మ పురాణం.

సంస్కృత భాషలో పురాణం అంటే నిత్యనూతనమైన ప్రాచీన గాథలు అని అర్థం చెప్పుకోవచ్చు. పురాణ అపినవమ్ అంటే పురాతనమైనప్పటికీ నూతనమైనవి అని అర్థం.

పురాణాలు త్రిమూర్తులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరుల గుణగణాలనే విశేషించి చిత్రించినా, వాటిలో అనేక ఇతర విషయాలు కూడా పొందు పరుప బడ్డాయి. పాశ్చాత్య దేశాలవారు కనీసం ఊహించలేనంత పూర్వమే, సౌరమండలానికి సూర్యుడే కాని భూమి కేంద్రకం కాదన్న విషయాన్ని విష్ణుపురాణం విశదం చేసిందన్న విషయం ఎంతో ఉత్సాహాన్ని కలిగిస్తుంది.

విశ్వం యొక్క పుట్టుక, దాని పరిణామం, కొన్ని యుగాల భ్రమణం అనంతరం సర్వ నాశనం జరిగినప్పుడు అదినూతన సృష్టికి ఎలా దోహదం చేస్తుందీ అనే సృష్టి, స్థితి, లయాలకు సంబంధించిన విషయాలను పురాణాలు వివరంగా చర్చిస్తాయి.

కాని, అటువంటి విశేషంగా వేదాంతపరమైన, శాస్త్రీయమైన విషయాలనే పురాణాలెప్పుడూ చర్చిస్తూ ఉండవు. ఉదాహరణకి గరుడ పురాణం మన దేహాన్ని ఆరోగ్యంగా ఉంచుకునే విధానాన్ని, వైద్య పరమైన అనేక విషయాలను చెప్తుంది.



మహాపురాణాలూ, ఉప పురాణాలే కాకుండా, ఒక్కొక్క పవిత్ర భాగానికి చెందిన స్థల పురాణాలు కూడా ఉన్నాయి. అవి భారత దేశంలోని అనేక పవిత్ర స్థలాల ప్రాముఖ్యతనీ విశిష్టతనీ జ్ఞప్తికి తెస్తాయి.



వందలాది సంవత్సరాలుగా, భారతీయ సంప్రదాయానికి, పూర్వ చరిత్రకి నిలయాలైన ఈ చిన్నచిన్న పురాణాలు, ఆసేతు హిమాచలం వ్యాపించి ఉన్న పవిత్ర స్థలాలకు తీర్థయాత్రలు చేయడానికి అనేకమందికి ప్రోత్సాహాన్ని కలిగించాయి.

వాస్తవానికి ఈ పురాణ కర్తలు యావద్భారత దేశాన్ని మాతృ దేశంగా ఎంతో పవిత్రంగా ఎంచారు. కలికి పురాణంలో చెప్పబడిన ఒక ప్రముఖమైన గాథ ద్వారా ఈ అభిప్రాయం వెల్లడైంది.

హిమాలయ పర్వతాల దిగువ ఉండే ఒక ప్రాచీన రాజ్యంలో దక్షుడనే ఒక యువరాజుండేవాడు. ఆయన దివ్యమాతయైన మహామాయ భక్తుడు. రాజకుమారుని భక్తికి మెచ్చి దేవి ఆయనకి ఒక వరాన్ని ప్రసాదించదలచుకుంది. యువరాజు దేవిని తన కుమార్తెగా పుట్టవలసిందిగా వరాన్ని కోరేడు. దేవి అందుకు అంగీకరించింది. కాని, 'నేను మానవరూపు దాల్చిన తర్వాత నువ్వు



నా దైవత్వాన్ని మరిచిపోయినా, నన్ను గౌరవించక పోయినా, నేను వెంటనే వెళ్లిపోతాను' అంది.

'నేనెలా మరచిపోగలను?' అన్నాడు దక్షుడు.

కొన్నాళ్లకి దక్షుడు రాజైనాడు. దేవి మానవ రూపంలో ఆయన కూతురుగా పుట్టింది. ఆమె ఎంతో అందంగా ఉండేది. ఆమె పేరు సతి.

దక్షుడికి తన కుమార్తె అంటే ఎంతో ప్రేమ. కానీ, ఆమె పెరిగిన కొలదీ దక్షుడికి కేవలం ఆమె తన కుమార్తె మాత్రమే కాదని తోచలేదు. దేవతల ప్రమేయం వలన సతికి మందమతి శివునితో వివాహం జరగడం దక్షుడికి సంతోషాన్ని కలిగించలేక పోయింది.

ఒక ఎద్దు, కొన్ని పాములూ, మరికొన్ని భూతాల సహవాసంతో శివుడు కొండ కొమ్మున నివసిస్తూండేవాడు. ఆయనకు ఒక ఇల్లంటూ లేదు, సుఖపడడానికి తగిన వసతీ లేదు. తమ కుమార్తె, అల్లుడూ సామాన్య మానవ మాత్రులుకారని జ్ఞాపకం ఉంటే తప్ప, బంధువులెవ్వరూ రావడానికి ఇష్టపడని ఇటువంటి చోటికి ఏ తండ్రి తన కుమార్తెని కాపరానికి పంపుతాడు?

ఒకసారి దక్షుని భవనంలో ఒక పెద్ద క్రతువు జరుగుతోంది. ఆయన సతిని, శివుని తప్ప మిగిలిన బంధువులందర్నీ ఆహ్వానించాడు. ఈ విషయం మహాముని నారదుని ద్వారా సతి తెలుసుకుంది. తన తండ్రిని చూడాలని వెంటనే నిశ్చయించుకుంది. అయితే, పిలవని పేరంటానికి వెడతావా అని శివుడు ఆమెను అడిగాడు. కేవలం తండ్రి, మాట వరసకి పిలవలేదన్నంత మాత్రంచేత కుమార్తె సందేహించాలా అని సతి వాదించింది.

సాయంకాలమైంది. వేలకొలదీ దివ్వెలతో, లక్షల కొలదీ పూలతో దక్షుని భవనం ప్రకాశిస్తోంది. విశాల ప్రాంగణంలో వందలాది అతిధులు ఆసీనులై ఉన్నారు. ఉన్నట్టుండి, ఎంతో సంతోషంతో సతి తండ్రి ఎదుటకు వచ్చింది.

కాని, ఆమె రాకకు దక్షుడు సంతోషించలేదు. విలువైన వస్త్రాలతోనూ, వజ్రవైడూర్యాలతోనూ తనూ, తన మిగిలిన కుమార్తెలూ వెలిగి

పోతూండగా, సతి సామాన్య వస్త్రధారణ చేసిరావడం ఆయనకు చికాకు కలిగించింది. సతి ఇలాగ కనిపించడానికి కారణం ఎవరు? తన మందమతి అల్లుడు తప్ప వేరే ఎవరూ కాదనుకున్నాడు, దక్షుడు.

కోపంతో శివుణ్ణి దూషించాడు. ఎన్ని అవమానాలనైనా సతి తనంతట తాను సహించేది. కాని, తన తండ్రి శివుణ్ణి విమర్శించడాన్ని ఆమె సహించలేకపోయింది. తండ్రిని వారించడానికి ప్రయత్నించింది. కాని ఆయన వినలేదు. దుఃఖాతిరేకంలో ఆమె క్రిందపడి చనిపోయింది.

ఈ విషాదవార్త శివునికి తెలిసింది. మామూలుగా శాంతంగా తపోనిష్ఠలో ఉండే శివుడు కోపంతో ఊగిపోయాడు. ఆయన కోపకారణంగా లక్షలాది అతివాస్తవ శక్తులు పుట్టి, వినాశనాన్ని, విధ్వంసనాన్ని చేయడానికి సిద్ధపడ్డాయి. అవి దక్షుని భవనాన్ని సమీపించి రెప్పపాటులో ఆ యజ్ఞవాటికను శ్మశాన వాటికగా మార్చివేశాయి.

శివుడు వెంటనే అక్కడకు వెళ్లి, నోరైనా విప్పకుండా తన భార్య మృత దేహం దగ్గర కూర్చున్నాడు. దుఃఖాతిరేకంలో ఆమెను తన భుజంపై వేసుకుని, లేచి, కనపడిన చోటకల్లా తిరగడం మొదలెట్టాడు.

కాని ఇలా ఎంతకాలం సాగాలి? చివరకు విష్ణుమూర్తి తన అదృశ్య ఆయుధమైన సుదర్శన చక్రంతో ఆమె శరీరాన్ని ఖండ ఖండాలుగా కోసేశాడు. ఆమె శరీరంలో ఏమీ మిగలక పోయేసరికి శివుడు తన వెండి కొండకు తిరిగివచ్చి, తపస్సమాధిలో ములిగి పోయాడు.



# తిరుక్కురళ్

ప్రపంచంలోని అతిప్రాచీన సజీవ భాష అయిన తమిళం, భారతదేశం గర్వించే విధంగా దాని సంస్కృతి పరంపరకు గణనీయమైన సేవ చేసింది. యుగాలుగా తమిళ సంస్కృత భాషలు అక్కాచెల్లెళ్ల లాగ కలసి మెలసి జీవించాయి.

రెండువేల సంవత్సరాలకు పూర్వం తమిళనాడుకు చెందిన ఒక సాధువు ఎన్నో చిన్నచిన్న పద్యాలను వ్రాశాడు. వాటిలో ఉన్న శక్తికీ, సత్యానికీ భారతీయ సాహిత్యంలో మరేదీ సాటిరాదు. ఆ గ్రంథాన్ని 'తిరుక్కురళ్' అనీ, 'కురళ్' అనీ పిలుస్తారు. 'తిరు' అంటే పవిత్రమైన అనీ, 'కురళ్' అంటే చిన్న పద్య భాగమనీ అర్థం. ఆ గ్రంథంలో పదేసి ద్విపదల చొప్పున 133 అధ్యాయాలున్నవి.

ఈ పద్యాలను వ్రాసిన సాధువు పేరు తిరువళ్లువర్. ప్రాచీన కాలంనాటి మహా మహులలాగే ఆయన కూడా తన జీవితంలోని వివరాలూ వదలిపోలేదు. ఆయన అసలు పేరేమిటో ఎవరికీ తెలియక పోవచ్చు. కాని, తిరువళ్లువర్ అంటే మాత్రం 'వళ్లువర్ కులానికి 'భక్తుడు' అని అర్థం. వళ్లువర్‌లు రాజసేవకులుగా ఉండి, ఏనుగులనెక్కి, భేరీలు మ్రోగించుకుంటూ రాజాజ్ఞలనూ, నిర్ణయాలనూ ప్రకటించేవారు. కాని, తిరువళ్లువర్ వేరే వృత్తిని స్వీకరించాడు. సాలెవానిగా ప్రస్తుత మదరాసు నగరంలోని మైలాపూరు అనే భాగంలో ఉండేవాడు. కాని, ఆయన సాలెవృత్తిని చేపట్టేడా లేదా అనే విషయం సందిగ్ధమే.

ఆయన ఇంతటి చక్కని పద్యాలను అల్లేడు కాబట్టీ, పూర్వకాలంలో ఎవరైనా ఆయనను సాలెవానిగా అభివర్ణించి ఉండవచ్చును.

ఆయనను గురించి ఎన్నో ఆసక్తిదాయకమైన కథలున్నాయి. తమ సమస్యల విషయంలో ప్రజలు ఆయనవద్దకు సలహా సంప్రతింపులకు వచ్చేవారు. ఆ సాధువు వీలున్నప్పుడల్లా వారికి కేవలం మాటల రూపంలో కాక కథలుగా ఉదాహరణలుగా చెప్పి వారిని సమాధాన పరిచేవాడు.

ఒకనాటి ఉదయం ఒక యువకుడు ఆయన ఇంటికి ఒక సమస్యను తీసుకు వచ్చాడు. భార్యను కలిగి ఉండడం మంచిదా కాదా చెప్పవలసిందిగా ఆయనను కోరేడు.



సాధువు నవ్వి, ఆ యువకుణ్ణి కొంత కాలం తన దగ్గరే ఉండమని కోరేడు. ఒకనాటి ఉదయం వారు పగటి భోజనానికి కూర్చున్నారు. సాధువు భార్య అంతకు ముందురోజున వండిన అన్నాన్ని, పాడై పోలేదు కదా అని వడ్డించింది. కాని, సాధువు, 'వాసుకీ, అన్నం చాలా వేడిగా ఉంది' అని కేక పెట్టాడు.

మారు మాటాడకుండా ఆయన భార్య వాసుకి దగ్గర కూర్చుని విసన కర్రతో విసరి అన్నాన్ని చల్లారబెట్టడం మొదలెట్టింది.

సాధువూ, అతిథీ భోజన మధ్యలో ఉండగా, ఆ సాధువు, 'వాసుకీ, చీకటి పడిపోయింది. నువ్వింకా దీపం వెలిగించావు కాదేమిటీ?' అని కేకేశాడు.

మారు మాటాడకుండా వాసుకి దీపాన్ని వెలిగించుకుని వచ్చి సాధువు దగ్గర పెట్టింది.

'అయ్యా, మీరు నా ప్రశ్నకు సమాధానాన్ని ఇచ్చేశారు, మీ భార్య లాగే వినయ విధేయతలు కలిగి, సేవాతత్పరత కలిగిన భార్య అయితే తప్పక ఉండవలసిందే' అన్నాడు, ఆ యువకుడు.

తిరువళ్లువర్ రాజాశ్రయాన్ని కోరలేదు. కాని, తరువాతి తరాల వారు ఆయనను జ్ఞానులలో రాజువంటివాడు అన్నారు. జీవితంలోని ప్రతీ విషయంలోనూ, మానవుడు ఎదుర్కొనే ప్రతి సంఘటనలోనూ కురళ్ ఉదాత్తమైన ఆచరణీయమైన సలహాలనిస్తుంది.

తిరుక్కురళ్ బోధలు కేవలం జీవితంలోని నైతిక విషయాలకు మాత్రమే పరిమితం కాలేదు. రాజకీయాలు, పరిపాలనా వ్యవహారాలు, మానవుని కార్యకలాపాలకు సంబంధించిన ఇతర విషయాలలో కూడా చక్కని సలహాలున్నాయి.



# కథా సరిత్సాగరం

కథలో కథ, అందులో మరో కథ – ఇలాగ రాజుల కథలూ, రాణుల కథలూ, రాక్షసుల కథలూ, బుద్ధిమంతులైన బాలుర కథలూ, అందమైన అమ్మాయిల కథలూ, బరితెగించిన మోసగాళ్ల కథలూ, సంస్కారం ఉండే సామాన్యుల కథలూ, మాట్లాడే జంతువుల కథలూ. మాయా పర్వతాల కథలూ, మంత్రించబడ్డ మేడల కథలూ, సాహసికుల కథలూ ప్రపంచంలోని అతి పురాతనమైన వందలాది కథల సంపుటి 'కథా సరిత్సాగరం'.

వీటిని ఎవరు వ్రాశారు? ఎప్పుడు వ్రాశారు? అన్నది ప్రశ్న. వీటిలో కొన్ని, కొద్ది మార్పులతో చాలాకాలం క్రితం, చాలా చాలా వేల ఏండ్లకు పూర్వం ఉన్నట్టు తెలుస్తోంది. మరికొన్ని కాశ్మీరు లోయలో, జీలం నది ఒడ్డున, గాలీవానా వచ్చిననాటి సాయంకాలం గ్రామీణులకు వినిపించినట్లు చెప్పుకుంటారు. ఇంకొన్ని కథలు కన్యాకుమారి వద్ద ఒక వేసవి రోజున తన పడవ నీడలో విశ్రాంతి తీసుకుంటూన్న పల్లెవాడు తన చుట్టూ చేరియున్న పిల్లలకు చెప్పినట్లు తలపోస్తారు.

కథా సరిత్సాగరం అంటేనే కథల నదులతో ఏర్పడిన అఖాతం కాబట్టి, దేశంలోని వందలాది కథలు అన్ని చోట్లనుంచీ వచ్చి ఈ కథా సరిత్సాగరంలోనికి దారి చూసుకుని ఉండవచ్చును. వివిధ దిశల నుంచి నదులు సముద్రంలోకి ప్రవహిస్తూ ఉంటాయి. అలాగే, వివిధ

దేశాలనుంచీ, దిశలనుంచీ, కథలను సేకరించి ఉండవచ్చునని సంపుట కర్త అభిప్రాయం.

వేయి సంవత్సరాలకు పూర్వం కాశ్మీరంలో నివసించిన సోమదేవుడే ఈ సంపుటి కర్త. ఆయన యిందులోని చాలా కథలను ఏ పుస్తకంలో నుంచి తీసుకొన్నాడో మనం నిశ్చయంగా చెప్పలేం. ఆ పుస్తకం పేరు మాత్రం బృహత్కథ, లేక, పెద్ద కథ అని మనకు తెలుసు.

చాలాకాలం నుండి వాడుకలో లేని మతృభాష పైశాచీలో బృహత్కథను గుణాఢ్యుడు వ్రాశాడు. ఈ కథలను పద్య రూపంలో వ్రాసిన తర్వాత గుణాఢ్యుడు వాటిని తన పోషకుడు శాతవాహనుడికి వినిపించాడు. కాని, శాతవాహనుడు ఎటువంటి ఆసక్తినీ చూపించక పోవడంతో గుణాఢ్యుడు నిస్పృహతో కోపంలో ఆ వ్రాతప్రతిని ఆకు తర్వాత ఆకుగా మంటల్లో పారవేశాడు. జరిగినదానికి శాతవాహనుడు విచారించి, గ్రంథాన్ని సంపూర్తిగా నాశనం చేయవద్దని గుణాఢ్యుణ్ణి కోరేడు. అప్పటికే వ్రాతప్రతిలో మూడు వంతులు అగ్నికి ఆహుతై పోయింది.

సోమదేవుడు ఈ కథలను సంస్కృత భాషలోకి అనువాదం చేయడానికి పూర్వమే వీటిలో చాలా భాగం భారతదేశాన్ని దాటి ఇతర దేశాలకు వెళ్లిపోయాయి. వాటిలో కొన్నింటిని మనం అరేబియన్ నైట్స్ కథలలో గుర్తుపట్టగలం.

కథా సరిత్సాగరంలోని కథలు ఏ ఒక్క వ్యక్తి భావనాశక్తిని ఆధారం చేసుకొని వ్రాయబడ్డవి కావని నిస్సందేహంగా చెప్పవచ్చును. గుర్తు తెలియని వాటి రచయితలు దేశంలో అన్ని ప్రాంతాలకూ చెందిన వారు. వారు మహామేధావులు కాకపోవచ్చును. కాని, మానవ స్వభావాన్ని వారు తరచి చూచారు. ద్రోహుల్ని బయట పెట్టడంలో నిర్దయ, అమాయకుల బాధలను వర్ణించడం దయార్ద్రత, ప్రపంచంలో జరిగే విషయాలను విమర్శించడంలో వాస్తవిక దృష్టి వారికున్నాయి.

దుష్ట శిక్షణ, శిష్టరక్షణకు సంబంధించిన కథలను ఈ కథకులు చక్కగా చెప్పారు. అటువంటిదే మచ్చుకు ఒక కథ:

అనగనగా ఒక దేవాలయంలో ఒక దొంగ సాధువు ఉండేవాడు తాను మౌనవ్రతం పూనినట్టుగా నటిస్తూండేవాడు. చాలామంది ఆయన దర్శనం చేసుకోవడానికి వస్తూండేవారు. వచ్చేటప్పుడు వాళ్ళు విలువైన కానుకలూ, ఆహార పదార్థాలూ, వస్త్రాలూ, డబ్బూ తెచ్చేవారు. ఈ సాధువు వాటిలో ఎక్కువ భాగాన్ని తాసుంచుకుని, మిగిలినదాన్ని తన శిష్యులమని చెప్పుకుంటూ తన చుట్టూ తిరిగేవాళ్లకి పంచిపెట్టేవాడు.

ఒకసారి, బాగా డబ్బున్న ఒక వ్యాపారస్థుడు తన భార్యతోనూ, కుమార్తెతోనూ, ఆయన దర్శనానికి వచ్చాడు. అతని కుమార్తె చాలా అందంగా ఉంటుంది. ఆ దొంగ సాధువుకు ఆమెను పొందాలని దుర్బుద్ధి పుట్టింది. ఆమెను తనకిచ్చి పెళ్లి చేయవలసిందిగా ఆ వ్యాపారిని అడగవచ్చు. ఆ రోజుల్లో సర్వసామాన్యంగా, ధనవంతులు తమ కుమార్తెలను సాధువులకిచ్చి పెళ్లి చేసేవారు. కాని, ఈ సాధువు ద్రోహబుద్ధితో మాయోపాయాన్ని ఆలోచించాడు. ఆ వర్తకుణ్ణి పక్కకు పిలిచి, 'నేను మౌనవ్రతం అవలంబించానని మీకూ తెలుసు. కాని, మీరంటే ఉండే ప్రత్యేకాభిమానం వల్ల మీతో మాట్లాడక తప్పలేదు. అదీ ముఖ్యంగా మీ కుమార్తె విషయంలో. ఆమె ఎంతో దురదృష్ట జాతకురాలు. ఆమెను మీ దగ్గర ఉంచుకున్నారంటే మీ అదృష్టం కాస్తా హరించుకుపోతుంది' అని చెప్పాడు.

ఆ వ్యాపారస్థుడు ఆదుర్దాతో, 'అయితే నన్నేం చేయమంటారు ?' అని అడిగాడు.

ఆ సాధువు, 'దానికేముంది? ఆమెను ఒక బుట్టలో పెట్టి దానిపైన ఒక దీపం వెలిగించి, ఈ రాత్రికే నదిలో వదిలెయ్యండి' అన్నాడు. 'సరే' నన్నాడు వర్తకుడు.

ఆ రాత్రి చీకటిపడిన తర్వాత ఒక యువరాజు ఇంటికిపోతూ, ఆ నదిని దాటడం కోసం అక్కడికి వచ్చాడు.

ఉన్నట్టుండి దీపంతో ఉన్న బుట్ట అతడి కంట బడింది. దాన్ని అతడు ఒడ్డుకు తెచ్చాడు. తెరచి చూసేసరికి లోపల ఒక అందమైన అమ్మాయి ఏడుస్తూ కనిపించింది. దాన్ని చూసి ఆశ్చర్యపోయాడు.

యువరాజు దగ్గర అడవిలో పట్టుకున్న ఒక భయంకరమైన కోతి ఉంది. దాన్ని ఆ యువరాజు ఆ బుట్టలో పెట్టి, ఆ బుట్టమీద దీపం పెట్టి యథాప్రకారం నదిలో వదిలేశాడు.

పైన దీపం వెలుగుతూన్న బుట్ట ఆ నదిలో కొట్టుకువస్తుందని, సాధువు గుడి దగ్గర, నది ఒడ్డున దానికోసం కాచుకు కూర్చున్నాడు. అది



కంటపడగానే తన శిష్యులను పంపి, దాన్ని తెప్పించి, తన గదికి చేర్పించాడు. శిష్యులందరినీ బయటికి పంపించి ఎంతో ఉత్సాహంతో ఆ బుట్ట తెరిచాడు.

ఏం జరుగుతుందో ఊహించుకునే లోపుగానే అతని ముక్కు కాస్తా ఎగిరిపోయింది. దాని తర్వాత అతని చెవి పోయింది.

ఆ సాధువు పిచ్చివాడిలా అరుచుకుంటూ పరుగులు తీశాడు. మళ్లీ



ఆ ఛాయలకు రాలేదు. అంత అందమైన అమ్మాయి అలా అడవి కోతి లాగ ఎలా మారిపోయిందో అని అతడు ఆశ్చర్యపోయి ఉంటాడు.

తర్వాత యువరాజు ఆ అమ్మాయిని పెళ్లి చేసుకున్నాడు. ఇద్దరూ సుఖంగా జీవితాన్ని సాగించారు.



# పంచతంత్రం

పూర్వకాలంలో ఒక రాజుండేవాడు. ఆయనకు ముగ్గురు కొడుకులు. వాళ్లు చదువుమీద ఏమాత్రం శ్రద్ధలేకుండా సమయాన్ని వృథాచేసే వారు. రాజు ఎంతో విచారించాడు. యువరాజులు ఇదే ప్రకారం సమయాన్ని వృథా చేస్తూంటే వాళ్లలో ఎవ్వరికీ రాజ్యం, సింహాసనం దక్కవని రాజుకు తెలుసును.

ఒకరి తర్వాత ఒకరిగా గురువులను ఏర్పాటు చేశాడు. కాని ఫలితం లేకపోయింది. గురువుగారు కనపడితేనే యువరాజులు భయపడి పారి పోయేవారు.

రోజులు దొర్లుతున్న కొద్దీ రాజుగారికి నిరాశ ఎక్కువ కాసాగింది.

చివరకు రాజు దేశంలో ఉండే పండితులనందరినీ ఆహ్వానించి, తన సమస్యను చెప్పాడు. 'నాకెవరైనా సహాయం చేయగలరా' అని అడిగాడు.

చాలాసేపటివరకూ ఎవ్వరూ జవాబు చెప్పలేకపోయారు. చివరికి వారిలో ఒక వ్యక్తి లేచి, 'రాజా, మీ పిల్లల్ని నాకు వప్పచెప్పండి, చేతనైనంత కృషి చేస్తాను' అన్నాడు.

ఆ పండితుడే విష్ణుశర్మ. రాజ్యమంతటా తన తెలివితేటలకు పేరు పొందాడు. అటువంటి వ్యక్తి తన కుమారులకు చదువు చెప్పనుండడంతో రాజు సంతోషించాడు.

రాజుకు పెద్ద భవంతి ఉంది. దాని విశాలమైన ఉండపైన డాబాకు

నీడనిస్తూ చెట్లూ ఉన్నాయి. విష్ణుశర్మ ఆ యువరాజులను డాబామీద ఒక మూలకు తీసుకుపోయాడు. వాళ్లను తన ఎదట కూర్చోబెట్టు కున్నాడు.

చదువంటే కిట్టదు కాబట్టి మొదట్లో వాళ్లకి అయిష్టంగానే అని పించింది. కాని, క్రమేపీ వాళ్లు లేచి వెళ్లడానికి ఇష్టపడని స్థితికి వచ్చారు. విష్ణుశర్మ బోధించే విధానంలోనే ఉంది, ఆ ప్రత్యేకత. 'గోదావరి నది ఒడ్డున ఒక పెద్ద చెట్టుంది. ఆ చెట్టుమీద పిట్టలున్నాయి. రాత్రి పూట అవి ఎక్కడెక్కడినుంచో వచ్చి అక్కడకు చేరుతూంటాయి' అని మొద లెట్టేవాడు.

ఆయన అలాగ పక్షులను గురించీ, జంతువులను గురించీ కథలు చెప్పుకుంటూ పోయేవాడు. నిజానికి ఈ కథలన్నీ మనల్ని గురించీ, మన సమస్యలను గురించీ చెప్తూ, సమాధానాల్ని సూచిస్తాయి. స్నేహితులుగా



చెప్పుకోదగ్గ వాళ్లెవరు? స్నేహాన్ని కాపాడుకోవడం ఎలాగ? మంచి తనం మంచిదే కాని, అందులోనే, జాగ్రత, ఉదాత్తత, వీటితోపాటు ఇతరుల మనస్సును తెలుసుకుని సంచరించే స్వభావం ఉండడం మంచి దని ఈ కథలవల్ల తెలుస్తుంది.

విష్ణుశర్మతో సహవాసం వలన ఈ కుర్రవాళ్లు ఎంతో లోక జ్ఞానాన్ని, తెలివితేటల్ని అలవరచుకున్నారు.

పంచతంత్ర కథల్ని అనేకులు అనేక రకాలుగా చెప్పారు. వాటిలో చాలా కథల్ని మీరు చదివే ఉంటారు. వాటిలో కొన్ని కథలు విశేష ప్రచారంలో లేకపోయినా, నిజానికి అవి మణిపూసలు. ఉదాహరణకి 'మాట్లాడే గుహ' కథనే తీసుకుందాం.



కథ ఎంతో సరదాగా ఉంటుంది. కాని, ఎవరి జాగ్రతలో వాళ్లు ఉండాలనే నీతిని కూడా బోధిస్తుంది.

అనగనగా ఒక అడవిలో ఒక నక్క ఉండేది. తన నివాసానికి అది ఒక ఏకాంతమైన గుహను ఎన్నుకుంది. ఒకనాడు నక్కలేని సమయంలో, అలసిపోయి ఆకలిగొన్న సింహం ఒకటి ఆ గుహ దగ్గరకు వచ్చింది. లోపలికి వచ్చి అక్కడంతా వాసన చూసింది. అక్కడ ఒక నక్క నివసిస్తూ ఉండాలని ఊహించుకుంది. 'ఆహారంకోసం వెతుక్కుంటూ నేను అక్కడా ఇక్కడా ఎందుకు తిరగాలి? నేను ఇక్కడే పడుకుని విశ్రాంతి తీసుకుంటాను. నక్క తిరిగి వచ్చిన తర్వాత నాకు చక్కటి ఆహారం లభిస్తుంది' అనుకుంది.

మధ్యాహ్నానికి నక్క తిరిగి వచ్చింది. గుహలో ప్రవేశించే ముందు అక్కడ సింహం పాదాల గుర్తులు ఉన్నట్టుగా గ్రహించింది. గుండె వేగంగా కొట్టుకోవడం మొదలెట్టింది. బయటికి వచ్చేసి 'ఓ మాట్లాడే గుహా, ఈ వేళ నీకేమైంది? నేను తిరిగి వచ్చినప్పుడు మామూలుగా నువ్వు 'నక్కగారూ, సుస్వాగతం' అని ఆహ్వానిస్తావు కదా? ఇవ్వాళెందుకు నిశ్శబ్దంగా ఊరుకున్నావు? బహుశా నేను లోపలికి రావడం నీ కిష్టం లేదేమో?' అని అరిచింది.

'బహుశా నేను లోపల ఉండడం వల్ల భయంవేసి ఈ గుహ నక్కకు స్వాగతం చెప్పలేదేమో?' అనుకుంది, ఆ సింహం తనలో తాను.

'దయచేయండి నక్కగారూ. సుస్వాగతం' అని గర్జించింది.

అరచేతిలో ప్రాణాలను పెట్టుకుని నక్క, 'ఓ గుహా, నేను నిన్ను వదిలేస్తున్నాను' అని జవాబిచ్చింది. 'మాట్లాడే గుహ గురించి ఎక్కడా వినలేదు, ఇంకా నయం, బ్రతికిపోయాను' నవ్వుకుంది తనలోతాను.



# జాతక కథలు

నేడు విశేషంగా అమలులో ఉన్నాయనుకున్న మతాలలో బౌద్ధమతం ఒకటి. భారతదేశంలో ఎక్కువ మంది బౌద్ధ మతస్థులు లేకపోయినా, ప్రతి భారతీయునికీ బుద్ధుని జీవితం గురించి అంతో ఇంతో తెలుసును. ఆయన యువరాజుగా జన్మించాడు. గౌతముడని పిలువబడేవాడు. తన సంసారాన్నీ, సంపదనీ, అధికారాన్నీ వదిలిపెట్టి ఆయన అసౌఖ్యాన్ని జయించేటందుకు అడవులకి వెళ్ళిపోయాడు. కాని, ఆయన గౌతముడుగా పుట్టడానికి ముందు మానవ రూపంలోనూ జంతురూపంలోనూ కొన్ని వందల జన్మలెత్తినట్లు గాథల వల్ల తెలుస్తోంది. ప్రతి జన్మలోనూ ఆయన ఎన్నో విలువైన అనుభవాలను సంపాదించి, వాటిని బుద్ధునిగా తన శిష్యులకు ఉపదేశించాడు.

ఈ గాథలనే జాతక కథలంటారు. వీటిలో ఎన్నింటిని బుద్ధుడు వివరించాడో చెప్పడం కష్టం. తర్వాతి కాలంలో ఆయన శిష్యులుగా చెప్పబడేవారు వీటికి ఇతర కథలని ఎన్నింటిని చేర్చారో నిర్ణయించడం కూడా కష్టమే.

జాతక కథలు మొత్తం 457 ఉన్నాయి. జాతక అనే మాటకు పుట్టుక అని అర్థం చెప్పుకోవచ్చు. ప్రతి జాతక కథలోనూ కనీసం ఒక కథయినా ఉంటుంది.

ప్రతి కథకూ ఒక నీతి ఉంటుంది. మానవుల బాధలకు ముఖ్య కారణాలలో కొన్నిగా చెప్పుకునే అర్థంలేని ఆడంబరం, అసూయ, దురల

వాట్లను గురించి ఈ కథలలో నొక్కి చెప్పబడింది. అందువల్ల ఈ కథలు జీవితాన్ని బాగా అర్థం చేసుకోవడానికి, సుఖమయ జీవనాన్ని సాగించడానికి ఎంతగానో తోడ్పడతాయి.

ఉదాహరణకి దొంగ సాధువు విషయాన్నే తీసుకుందాం. ఆయన కాషాయవస్త్రాలు, బవిరి గడ్డమూ చూసి ప్రజలు ఆయన ముందు మోకరిల్లి తల వంచేవారు. ఇది ఆయనలో గర్వాన్ని పెంచింది. అటువంటి భక్తి ప్రపత్తులు తనపట్ల ఉండవలసిందేనని ఆయన అనుకునేవాడు.

ఒకనాడు ఆయన దారివెంట పోతూ పొట్టేళ్ల పందేన్ని చూడడానికి గుమిగూడిన ప్రజలను చూశాడు. ఆ సాధువు అక్కడే ఒక రాతిమీద కూర్చుని, గొంతుక సవరించుకుని, కొంచెం దగ్గి ప్రజలను ఆకర్షించడానికి ప్రయత్నించాడు.

దురదృష్టవశాత్తూ ప్రజలు ఆయనను గుర్తించేలోపుగానే పొట్టేళ్లలో ఒకటి ఆయనను చూసింది. ఎందువల్లనో, ఆ జంతువుకు ఆయన చూపులు కిట్టలేదు. ఆయనను ఎదిరించాలనుకుంది.

ఢీకొనడానికి ముందు తలవంచడం పొట్టేలుకు అలవాటు. పొట్టేలు తలవంచగానే, తనకు గౌరవం ఇవ్వడానికే పొట్టేలు అలా చేసి ఉంటుందనుకొని సాధువు గర్వపడ్డాడు. అక్కడనుంచి లేచి దూరంగా పొండని ప్రజలు అరిచినా ఆయన వినిపించుకోలేదు. సరికదా, ఆయన తన చేతిని ఎత్తి పొట్టేలును ఆశీర్వదించబోయాడు. మరుక్షణంలో పొట్టేలు ఆయనను కుమ్మేసి కింద పడేసింది.

అసూయ యొక్క ఫలితం ఇంకా అనర్థదాయకంగా ఉంటుందని ఈ క్రింది కథవలన తెలుస్తుంది.

ఇంద్రజాలం తెలిసిన ఒక చదువురాని గ్రామస్థుడి దగ్గరకు ఒకసారి ఒక పనీపాటా లేని యువకుడు వచ్చాడు. ప్రతిరోజూ ఆ గ్రామస్థుడు అడవిలోకి పోయి, మామిడిచెట్టు కింద నుంచుని మంత్రాలు చదవగానే ఆ మామిడిచెట్టు పళ్లతో బరువెక్కిపోయేది. మరుక్షణంలోనే ఆ పళ్లు ముగ్గి కింద పడిపోయేవి. ఆ గ్రామస్థుడు వాటిలో తిన్నన్ని తిని, మిగిలినవాటిని తన పొరుగున ఉన్న పేదవారికి పంచిపెట్టేవాడు.



ఆ యువకుడు కులం తక్కువ అని కూడా ఎంచక ఆ గ్రామస్థుడి కాళ్ల మీద పడి ఆ విద్యను తనకు నేర్పవలసిందిగా ప్రార్థించాడు. ఆ గ్రామస్థుడు మొదట్లో కాదన్నా, చివరికి వప్పుకుంటూ, 'ఈ మంత్ర విద్యను నువ్వు నీ స్వార్థానికి ఎప్పుడూ వాడుకోకూడదు. నువ్వు అబద్ధం చెప్పనంత కాలం మాత్రమే ఈ విద్య నీకు పని చేస్తుంది' అని హెచ్చరిక చేశాడు.

యువకుడు తన గ్రామానికి తిరిగివచ్చి, ఈ మంత్రాన్ని రోజూ అనేక సార్లు ఉచ్చరిస్తూ, రుచికరమైన ఎన్నో మామిడిపండ్లను పొందేవాడు. వీటిని అతడు సంతలో అమ్మి కొన్ని నెలలలోనే ధనవంతుడైపోయాడు.

రాజాగారికి ఈ మాయాజాలం గురించి తెలిసింది. ఆయన ఆ యువ కుణ్ణి పిలిపించి, 'నువ్వు ఈ విద్యను ఎక్కడనుంచి నేర్చుకున్నావు?' అని అడిగారు.

తక్కువ కులస్థుడి దగ్గర తాను నేర్చుకున్నానని చెప్పడానికి ఇష్టం లేక ఆ యువకుడు గర్వంగా, 'రాజా, నే నీ విద్యను ఎక్కడో అతి దూరాన ఉండే విశ్వవిద్యాలయంలో, గొప్ప విద్వాంసుల దగ్గర ఎంతో కష్టపడి శుశ్రూష చేసి నేర్చుకున్నాను' అని చెప్పాడు.

'బాగానే ఉంది. ఆ విద్యను మా ఎదట ప్రదర్శించి చూపించు' అని రాజుగారు ఆజ్ఞాపించారు.

రాజుగారు, వారి కుటుంబ సభ్యులూ, మంత్రి వర్గం, అనేకమంది అధికారులు, ఆ యువకుడి వెంట రాజుగారి తోటలోకి వెళ్ళారు. ఆ యువకుడు ఒక పెద్ద మామిడిచెట్టును ఎన్నుకుని, మంత్రాలు ఉచ్చ రించడం మొదలెట్టాడు. అతడు అబద్ధం చెప్పాడు కాబట్టి ఏమీ ప్రయోజనం లేకపోయింది.

ఎంతో అవమానంతో ఆ యువకుడు రాజుగారికి నిజం చెప్పేశాడు. 'గర్వంతో నువ్వు నీ గురువుగారికి కృతజ్ఞత చూపలేకపోయావు. వెళ్లి ఆయనను క్షమార్పణ వేడుకో, తిరిగి నీ మంత్రం ఫలిస్తుందేమో?' అన్నారు రాజుగారు.

ఆ యువకుడు ఆ ప్రకారం చేశాడు. కాని, ఆ మంత్రం ఫలించ లేదు. అప్పుడే కాదు, ఎప్పటికీ. కారణం, ఆ యువకుడు దాన్ని తన స్వార్థానికి వాడుకోవడం.

ఇటువంటి నీతి పాఠాలెన్నో జాతక కథల్లో ఉన్నాయి.

# అర్థశాస్త్రం

రాజుగారి వల్ల అవమానం పొంది, ఒక ఉత్తమ వంశంలో పుట్టిన యువకుడు, పగ ఎలా సాధించాలా అని ఆలోచించుకుంటూ, ఒంటరిగా, దారివెంబడి నడిచిపోతున్నాడు. ఒక ముళ్లపొద వేళ్లకు ఏదో రసం పోస్తున్న ఒక కోపిష్టి ముసలాయనను అతడు చూశాడు. అదొక వింత దృశ్యం.

'మీరిక్కడ ఏం చేస్తున్నారు?' అని అడిగాడు, ఆ యువకుడు.

'ఈ పొదలోని ఒక ముల్లు నా కాలిలో దిగింది. అందుకు ఈ మొక్కలన్నింటిని నాశనం చేసేస్తున్నాను. వీటి మొదళ్లలో పానకం పోస్తున్నాను. దీనివల్ల లక్షలకొద్దీ చీమలు ఇక్కడ చేరి ఈ వేళ్లను తినేస్తాయి. ఈ మొక్కలు చచ్చిపోతాయి' ముసలాయన జవాబు.

ఆ ముసలాయన తెలివితేటలు, నిశ్చయమూ యువకుణ్ణి ఆశ్చర్యపరచాయి. పగ ఎలా సాధించాలో చక్కని సలహా ఈ ముసలాయనే ఇవ్వగలరనుకున్నాడు.

ఆ యువకుడి పేరు చంద్రగుప్తుడు. ఆ ముసలాయన చాణుక్యుడు. చంద్రగుప్తుడు చాణుక్యుని తనకు సలహాదారుగా ఉండమని కోరేడు. రాజు మీద తనకూ కోపం ఉంది కాబట్టి ఆ ముసలాయన అందుకు వప్పుకున్నాడు.

చాణుక్యుని మార్గదర్శకత్వంలో చంద్రగుప్తుడు ఆ కాలంలో మగధను పరిపాలించే నందరాజును తొలగించి తానే సింహాసనం ఎక్కేడు. మౌర్యవంశాన్ని స్థాపించాడు.

చంద్రగుప్త చాణుక్యుల మొదటి పరిచయాన్ని గురించిన కథ బహుశా నిజం కాకపోవచ్చు. కాని, దాని ప్రచారంవల్ల ప్రజలు చాణు క్యుణ్ణి గురించి ఎలా తలపోసేవారో తెలుస్తుంది. ప్రజల అభిప్రాయంలో చాణుక్యుడు తెలివైనవాడు, కోపధారి, తన పని ఎలా నెరవేర్చుకోవాలో బాగా తెలిసినవాడు.

చాణుక్యుని కౌటిల్యుడని కూడా అంటారు. ఈ మాటకు అర్థం కుటిల నీతిని తెలిసినవాడు అని చాలామంది నమ్ముతారు. బహుశా మొదట్లో ఈ పేరు కౌటిల్యుడు కాని కౌటిల్యుడు కాకపోయి ఉండవచ్చు. కౌటిల్యుడు చాణుక్యుని వంశంలో మూలపురుషుడు కావచ్చును.

ఆయన వ్రాసిన పుస్తకం ఆధారంగానే చాణుక్యుని తెలివితేట లున్న వ్యక్తిగానూ, కోపధారిగానూ అనుకోవచ్చు. ఆ పుస్తకానికి మనం ఇంతవరకూ చర్చించుకున్న విషయాలతో ఏమీ సంబంధం లేదు. దాని పేరు 'అర్థశాస్త్రం.' ఆధ్యాత్మిక విషయాలూ, వేదాంతం, కథలూ, కావ్యాలకే మాత్రమే ప్రాచీన భారతీయ విజ్ఞానం పరిమితం కాదని ఈ పుస్తకం చెపుతుంది. జీవితానికి సంబంధించిన అన్ని కోణాలనూ ఈ పుస్తకం వ్యక్తం చేస్తుంది. పురాణ యుగంలోని వ్రాయబడ్డ అర్థశాస్త్రం – ఆర్థిక శాస్త్రానికీ, సామాజిక శాస్త్రానికీ, న్యాయ శాస్త్రానికీ, రాజనీతి శాస్త్రానికీ సంబంధించినది.

ఈ విషయాల మీద పూర్వపు పండితులు వెలువరించిన సిద్ధాంతా లనూ, ఆదర్శాలను చాణుక్యుడు పూర్తిగా అధ్యయనం చేశాడు. రాజులూ, అధికారులూ వాటిని చదివి, వాటివల్ల లాభం పొందటానికి ప్రయత్నించ రని ఆయనకు తెలుసు. అందుకునే, ఆయన తన గ్రంథంలో అనుభవజ్ఞు లెందరో వ్రాసిన లేక చెప్పిన విషయాల సారాంశాన్ని పొందుపరుస్తూ, తన వ్యాఖ్యానాన్ని కూడా జోడించాడు.

కొందరు విమర్శకులు చాణుక్యుణ్ణి నిర్దయుడనీ, కుటిలుడనీ అనడానికి కారణం ఆయన తన శత్రువులను అణచడానికి ప్రయోగించిన మోసమే. ఆయన తన పుస్తకాన్ని రాజులకూ, రాజనీతిజ్ఞులకూ, పరిపాలకుల ఉపయోగార్థం వ్రాశాడు. రాజుల్లో ఎవరో ఒకరు ఆ

రోజుల్లో మోసాలు చేస్తూనే ఉండేవారు. అయితే ఎలాంటి పరిస్థితుల్లో మాత్రమే మోసాలు చేయతగును, ఎలాంటి పరిస్థితుల్లో చేయకూడదు అనే విషయాన్ని ఆయన స్పష్టం చేశాడు.

రాజ్యపాలనలో ఎన్నో అర్థం లేని సిద్ధాంతాల్ని ఆయన త్రోసిరాజన్నాడు. ఒక చిన్న ఉదాహరణ: ఆ రోజుల్లో తరుచుగా యువరాజులు తండ్రిని చంపి రాజ్యానికి వచ్చేవారు. దీన్ని నివారించడానికి అంతకు



ముందు మంత్రులుగా ఉండినవారు ఎన్నో పద్ధతులను రాజులకు సూచించారు. రాజధానినుంచి దూరంగా ఎక్కడో ఒక కోటలో యువ రాజులను బంధించి ఉంచడం ఉత్తమమని కొందరి అభిప్రాయం. యువ రాజులకు రాజుగారు మరణదండన విధిస్తారనే భయం కలిగించడం మంచిదని మరికొందరి అభిప్రాయం. చాణుక్యుడు ఈ విషయాలను గురించి ప్రస్తావించి, ఇవన్నీ తప్పుడు పద్ధతులన్నాడు. మంచి గురువుల శిక్షణలో యువరాజులను తీర్చిదిద్దడమే ఆచరణ యోగ్యం అన్నాడు.

ఈ విధంగా చూస్తే 'అర్థ శాస్త్రం' ఆచరణ యోగ్యమైన సలహాల తోనూ, సంపూర్ణ ప్రపంచ జ్ఞానంతోనూ నిండి ఉంది.

